# శ్రీ దత్తమంత్ర సుధార్ణవము

(దత్తాత్రేయకల్ప, సహస్రనామస్తోత్ర, పూజావిధి సహితము)




రచన, సంకలనము

G. V. L. N. విద్యాసాగరశర్మ, M. A.,

(రిటైర్డ్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్)

శ్రీ సాయిదత్త పబ్లికేషన్స్

5వ లైను, ఆనందతీర్థ అగ్రహారం

గుంటూరు. – 4.

శ్రీ సాయిదత్త పబ్లికేషన్స్–3.
సర్వసామ్య సంకలితము
ప్రతులు 1000

1993 డిసెంబర్ 28
దత్తజయంతి

ముద్రాపయిత :
శ్రీ గోవిందరాజు దత్తాత్రేయులు
సత్యనారాయణపురం,
విజయవాడ.

ప్రతులకు :
విశ్వమందిరం
3వ లైను, కృష్ణనగర్
గుంటూరు–6.

గురుదక్షిణ : 25 రూపాయలు

ముద్రణ :
శ్రీపతి ఆర్ట్ ప్రింటర్స్
బ్రాడీపేట, 4వ లైను,
గుంటూరు – 2.



శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు మహరాజ్

# అంకితం

అజ్ఞాన ధ్వాంత దీపకుడు

ఆర్తజన బాంధవుడు

దివ్యసుందర విశ్వమందిర నివాసి

అవ్యాజ కరుణామూర్తి

ఆత్మానంద ప్రదాయకుడు

సంపూర్ణ దత్తావతారుడు

శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు మహారాజ్

అరుణారుణ చరణ కమలాలకు

పూజా ప్రసూనంగా

ఈ గ్రంథాన్ని అంకితం చేస్తున్నాను.

— గోవిందరాజు దత్తాత్రేయులు

# శ్రీ సాయి దత్త స్తోత్రము

శ్లో॥ అనాథనాథ నాథాయ ఆధివ్యాధి హరాయ చ
విశ్వమందిర వాసాయ సాయిదత్తాయ తే నమః ॥

శ్లో॥ సిద్ధరాజాయ సిద్ధాయ దేవాయ పరమాత్మనే
విశ్వమందిర వాసాయ సాయిదత్తాయ తే నమః ॥

శ్లో॥ సచ్చిదానందబోధాయ నిర్గుణాయ గుణాత్మనే
విశ్వమందిర వాసాయ సాయిదత్తాయ తే నమః ॥

శ్లో॥ భక్త ప్రియాయ దేవాయ భక్తానంద కరాయ చ
విశ్వమందిర వాసాయ సాయిదత్తాయ తే నమః ॥

శ్లో॥ సర్వాపరాధనాశాయ లీలా విశ్వంభరాయ చ
విశ్వమందిర వాసాయ సాయిదత్తాయ తే నమః॥

ఇదంస్తోత్రం మహద్దివ్యం విశ్వమంగళదాయకం
ప్రపఠేత్ నియతో భక్త్యా సాయిదత్తప్రియోభవేత్॥

— విద్యాసాగర శర్మ

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

# దత్తాశీస్సులు

ఈ యావత్తు సృష్టికి మూలమై, విశ్వము నంతటిని క్రమరీతిలో నడిపించుచున్న విశ్వశక్తియే "దత్తశక్తి". ఆ దత్తశక్తిని దర్శించడానికి గల వివిధ ఉపాసనామార్గాలు మంత్రతంత్రయంత్ర సహితము గా ఈ గ్రంథంలో వివరించ బడినవి. అర్థములు విశేషార్థములు, యోగార్థములతో నిండి ఈ గ్రంథము ఉపాసకులకూ, పరిశోధకులకూ, అన్వేషకులకూ ఆనందదాయకమై మనస్సంతృప్తిని ప్రసాదిస్తున్నది. అతిగోప్యమైన, గుహ్యాతిగుహ్యమైన, అతి నిగూఢమైన విషయాలు కొన్ని చాలదివ్యముగా, అందరికీ అర్థమయ్యే రీతిలో అందించబడినవి. పరమపవిత్రమై, శక్తివంతమై, పాఠకులకు ఆశీస్సుల నందిస్తూ, సాధనా మార్గాన్ని దర్పణ దర్శితం చేస్తున్నది ఈ గ్రంథం. ఎక్కడెక్కడో దాగిఉన్న విషయాలు సద్గురు కృపాకటాక్షముతో అందించిన రచయితనూ, ఈ గ్రంథ ముద్రణకర్తనూ అభినందిస్తూ దివ్యాశీస్సు లందిస్తున్నాను.

సహృదయ సాధకలోకం ఈ గ్రంథాన్ని సద్వినియోగం చేసుకోగలదని ఆశిస్తూ, సర్వజనావళికి శుభాశీస్సు లందిస్తున్నాను.

విశ్వమందిరం,
గుంటూరు.
17-12-1993,

— శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ

శ్రీ

# అమృతలహరి

శ్రీ దత్తమంత్రసుధార్ణవము రచించిన వ్యక్తి నాకు అత్యంత సన్నిహితుడు, ప్రాణసమానుడు విద్యాసాగరశర్మ. కొద్దికాలం క్రింద జరిగిన అతని షష్టిపూర్తిసభలో మా యిద్దరి ఆత్మీయతను గూర్చి నేను కొన్ని పద్యాలు చెప్పాను. అందులోని భావాలు కేవల కవితా విశేషాలు మాత్రమే కాదు. హృదయసుధార్ణవమథనోదిత ప్రేమామృతకలశ పయస్సులు. అటువంటి మిత్రుడు ఈ గ్రంథం రచిస్తే నన్నుమించి ఎవరు పొంగిపోతారు. ?

ఇక ఈ గ్రంథం సామాన్యమైనది కాదు. మైత్రీప్రధానులైన వ్యక్తులు గ్రంథరచన చేసినప్పుడు అందులోని విషయం కంటే అభిమానానికి ప్రాధాన్యంయిచ్చి ఏదో ప్రశంసించటం జరుగుతుంది. ఇక్కడ నాకా అవసరం కలగలేదు ఆసలు సాగరుని విషయంలో ఎప్పుడూ ఆ పరిస్థితి రాలేదు. సృజనాత్మకము, పరిశోధనదక్షము, ప్రతిభాపాటవోల్లసితము-అయిన అతని రచనాశక్తి రసరమణీయం కావటంచేత ఎవరికైనా మెచ్చుకోక తప్పదు.

విద్యాసాగరశర్మ దత్తభక్తుడు. దత్తోపాసకుడు. బహుజన్మ పరంపరాసాధనప్రాప్తదైవీసంపద్విభాసితుడు. విద్యావినయ విలసితుడు. లోకంలో ఎవరియిష్ట దైవం వారికి సర్వాధికము. అలానే ఉండాలి కూడా. అయినా మంత్రశాస్త్రములలో ఆయా దేవతల లక్షణాలు చెపుతూ ఎవరికేది యిష్టము, ఏది యిష్టం కాదు, ఎవరిని దేనివల్ల ప్రీతుణ్ణి చేసుకోవచ్చు అనేవి చెప్పబడినవి.

శ్లో॥ అలంకారప్రియోవిష్ణుః అభిషేకప్రియశ్శివః
నమస్కార ప్రియస్సూర్యః గణేశ స్తర్పణప్రియః
హోమప్రియో మహేంద్రస్తు దుర్గాదే వ్యర్చనప్రియా
దీపప్రియః కార్తవీర్యః దత్తస్తు స్మరణప్రియః

విష్ణుమూర్తికి అలంకారమంటే యిష్టం. శివుడో అభిషేక ప్రియుడు. సూర్యుడు నమస్కరిస్తే సంతోషిస్తాడు. అందుకే సూర్యనమస్కారాలు వచ్చినవి. గణపతికి యాభై రకాల తర్పణాలున్నవి. అవి ఆయనకిష్టం. ఇంద్రుడు వేల్పులదొర. వేల్చుట దానినుండి ఆహుతులు స్వీకరించుట ఆదేవునకు ప్రీతి. వివిధ పుష్పాదులతో అర్చిస్తే పరమేశ్వరి కిష్టం. దీపం వెలిగించి "కార్త వీర్యార్జున" అని ముమ్మారు తలచుకొంటే సర్వబాధలు తొలగిస్తాడా సహస్రభుజుడు. "దత్తా! దత్తా!" అని స్మరిస్తే చాలు అనుగ్రహిస్తాడా కరుణావరుణాలయుడైన ఆత్రేయుడు. ఆ దత్తాత్రేయుని గురించిన ఎన్నో విశేషాలు ఎంతో పరిశోధనచేసి, బహుగ్రంథ పరిశీలనచేసి, భక్తుల కందుబాటులోకి తెచ్చిన సాగరుని హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను. అందులోని విశేషాలు వివరించటమంటే మరో గ్రంథం వ్రాయాలి. ఆ పని చేయటంకంటే "ఇదిగో ! ఈ అద్భుత గ్రంథం మీ ముందుంది ! గ్రహించండి !" అనటం ఔచిత్య సుందరం. భవ్యతరం - భద్రమస్తు !

16-12-93 డాక్టర్ ప్రసాదరాయకులపతి
గుంటూరు

ఓం

# దివ్యానుభూతి

సకల సద్గుణ సంపన్నుడు, సర్వశక్తిసమన్వితుడు, సర్వజ్ఞుడు, ఏకైక శక్తిస్వరూపుడు, యోగీశ్వరేశ్వరుడు, లోకగుర్వుడు, బాలోన్మత్త పిశాచ వేషధారి శ్రీదత్తాత్రేయస్వామి. ఆయనయే అనసూయాత్రి నందనుడై సర్వలోక పూజితుడైనాడు.

సాధకునకు అఖిలశక్తి ప్రదాత ఆయనయే ! నిత్యానంద నిలయుడైన ఆ పరమాత్మని మీద దృఢమైన భక్తి కలగాలి. తద్వారా సాధకునికి శ్రీదత్తుని అనుగ్రహం తప్పక లభిస్తుంది. ఆయన కృపాలబ్ధివలననే "నేను" "నాది"-అనగాఅహంకార, మమదరములు-నివృత్తి అవుతవి. "సర్వభూతాలకూ సంబంధించిన సృష్టి స్థితి, లయాలకుఆ పరమేశ్వరుని లీలావిలాసమేకారణం. ఆ పరమాత్మ యొక్క శక్తి మనకు అగ్రాహ్యంగా ఉంటుంది. ఆయన సర్వకార్య నియంత. "ఆయన ఇచ్ఛామాత్రం చేతనే ప్రాణికోటికి సుఖదుఃఖాలు సంభవిస్తుంటా"యన్న విషయం గోచరిస్తుంది. సాధకునిలో శ్రీదత్తభక్తిప్రవర్ధమానమగుచున్నకొలది పై దివ్యానుభూతులు క్రమంగా కలుగుతుంటవి.

ఆ పరమాత్మ యొక్క దివ్యానుగ్రహం పొందడమంటే అది బ్రహ్మానందప్రాప్తి కలిగినట్లే అయితే దానికై సాధకులు "సహనము, సమత్వము, కనికరము, స్నేహశీలత, శ్రద్ధ, భక్తి అనే సద్గుణాల (షడ్గుణాల) సోపానాల నధిరోహించవలసియున్నది. ఆ సర్వేశ్వరుని ప్రసన్నుని చేసుకోవడానికి ఇంతకన్నా వేరు మార్గములేదు.

అందుకై శ్రీదత్తచరిత్రపారాయణ, ఆయన కల్యాణగుణకీర్తన, ఆయన దివ్యభావస్మరణ, అనేవి మనం పాటిస్తే ఆయనకు మనలను అవి సన్నిహితులను చేస్తవి.

పరమ భాగవతోత్తముడై, శ్రీదత్తోపాసనతో ఆస్వామి యొక్క పరిపూర్ణానుగ్రహం పొందినవారు. శ్రీ జి వి. ఎల్. ఎన్. విద్యాసాగరశర్మగారు. వారు అనేక జన్మలనుండి కూడ శ్రీదత్తోపాసకులని శ్రీదత్తునిద్వారా తెలిసి పరమానందభరితుడనైతిని. అట్టి ఆయన కలమునుండి ఈ రచన రూపొందినది. వారి గురుభక్తి సద్గురు చరిత్ర యను శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామి (టెంబె స్వామి) జీవితచరిత్రయను గ్రంథములో అద్భుతంగా దర్శనమిస్తున్నది. గురు భక్తు లనుసరించే రీతిలోనే వీరుగూడ తమ కృతిని శ్రీవాసుదేవానందులకు సమర్పించు కొంటూ "ఓసమర్థ సద్గురూ ! ఓ వాసుదేవ ప్రభో ! ఈ నీ చరిత్ర నీ కృపాకటాక్షం వలన నిర్మించబడినది, కనుక దీనిని నీకే హృదయపూర్వకంగా సమర్పించుకొంటున్నాను" అని విన్నవించుకుంటారు.

ఇదీ అసలైన గురుశిష్య సంప్రదాయంలో విశిష్టమైన పద్ధతి. శిష్యుడెంత గొప్పవాడైనా అంతా శ్రీగురు ననుగ్రహమనీ, తాను నిమిత్తమాత్రుడననీ భావించుతాడు. అప్పుడా శిష్యు డుత్తమోత్తముడుగా గుర్తింపు పొందుతాడు. గుర్వనుగ్రహపాత్రునికి దైవానుగ్రహమూ తోడవుతుంది. అటువంటి గుర్వనుగ్రహం పరిపూర్ణంగా

పొందినవారు శ్రీవిద్యాసాగరశర్మగారు. వీరికలంనుండి ఈనాడు శ్రీదత్తమంత్రసుధార్ణవము వెలువడుటెంతయో ముదావహం. శ్రీదత్తావతారములోని రహస్యములు విజ్ఞాన శాస్త్రముతో సరిపోల్చి ఆధునికయువత కర్థమయ్యే రీతిలో ఈరచన సాగినది. భక్తులకు కావలసిన అనేక దత్తస్తోత్రములున్నూ, మంత్రములున్నూ, కవచములున్నూ అర్థసహితముగా పొందుపరుపబడిన ఈగ్రంథం దత్తగురు భక్తులకు, సాయిభక్తులకు ఒక వరప్రసాదం.

అట్టి ఈగ్రంథాన్ని సమగ్రంగా పఠించినవారికి అచిర కాలంలోనే దత్తానుగ్రహం తప్పక కలిగితీరుతుందని నా ప్రగాఢ విశ్వాసం. తద్వారా ఇష్టకామ్యసిద్ధియే గాక మోక్షప్రాప్తికూడ చేకూరుతుంది. సాధకుని మనస్సు శ్రీగురుచరణాల సన్నిధిలో స్థిరముగా ఉండునట్లు చేయుటలో ఈగ్రంథం సమర్థవంతమైన దిగా భావిస్తున్నాను.

ఈరోజు-డిసెంబరు 8వ తేది మధ్యాహ్నం-భోజనానంతరం శ్రీవిద్యాసాగరశర్మగారు "శ్రీగురుచరణం" కార్యాలయములో దర్శనమిచ్చారు. వారిని చూచి నేను పొంగిపోయాను. వారు ప్రింటింగులో ఉన్న "శ్రీదత్తమంత్రసుధార్ణవం" అనే గ్రంథానికి నా యభిప్రాయం వ్రాయమని కోరుచూ తమ దగ్గరున్న ప్రింటెడ్ ఫారాల ప్రతి నందించారు. దానిని తీసుకొని కన్నులకద్దుకొనిన

తోడనే అద్భుతమైనరీతిలో శ్రీదత్తుని దివ్యదర్శనం కలిగింది. అభయహస్తంతో, చిరునవ్వులు చిందిస్తూ, దివ్యతేజస్సుతో వెలిగిపోయే ఆమూర్తిని నాకు దర్శింపచేసినట్టిదీ గ్రంథం. ఆదృశ్యము ఈ గ్రంధకర్తయొక్క తపస్సుకు ఫలితం.

ఈ గ్రంథమహిమ అపారం, అమూల్యం, అనంతశక్తివంతమని అప్పుడే నాకు తోచినది ఈగ్రంథకర్త శ్రీవిద్యాసాగరశర్మగారు తమకు తాము సాధకులకు, భక్తులకు ఈగ్రంధరూపంలో దత్తమౌతున్నారు. కాబట్టి ఓ సాధకులారా! ఈ గ్రంథమును దత్తవరప్రసాదంగాభావించి, శ్రీదత్త తత్వమునవగాహనచేసుకొని, సమస్తశుభములు దత్తానుగ్రహంతోబాటు పొందుదురు గాక!

అవ్యాజ కరుణామూర్తియైన శ్రీదత్తుని అనుగ్రహముతో ఇంకను శ్రీవిద్యాసాగరశర్మగారి కలంనుండి ఇట్టి విశేషరచనలు ఎన్నో వెలువడాలని ఆశిసున్నాను – నా ఆశ పూర్తిచేయుటకై శ్రీదత్తగురుని హృదయపూర్వకముగా ప్రార్థిస్తున్నాను.

జై గురుదేవ దత్త

సత్యనారాయణపురం,
విజయవాడ
13–12–93

శ్రీ శ్రీ శ్రీ
స్వామి విశ్వలానంద సరస్వతీమహారాజ్

# అక్షరానందము

మాపితృపితామహులు దత్తోపాసకులగుటవలన దత్తాత్రేయు లని నాకు పేరుపెట్టినారు. దత్తప్రభువుమీద వాళ్ళకు ఉన్న ఆరాధన అభిమానం, ఆదరం అట్లాంటివి. నేను దత్తోపాసకుడనుకాకపోయి నప్పటికిని నాస్తికుడను మాత్రము కాను.

మా తండ్రిగారు శ్రీ వేంకట కోటేశ్వరరావుగారు, విజయ వాడకు సమీపమునగల "ఎనమలకుదురు" గ్రామకరణంగారైన శ్రీ పెదప్రోలు వెంకయ్యగారివద్ద శ్రీదత్తాత్రేయమంత్రాన్ని స్వీక రించారు. అప్పటినుండి మాతండ్రిగారు ప్రతి సంవత్సరము పొడుగునా శ్రీదత్తాత్రేయ షోడశావతారజయంతులు జరుపుతూ, ఆ పర్వదినాలలో పూజాదికములు నిర్వహిస్తూ ఉండేవారు. ఆయన పూజాగ్రంథమును మేము జాగ్రత్త పెట్టి దాచలేక పోయినాము. కానీ వారి గురువుగారైన శ్రీ వెంకయ్యగారి మంత్రగ్రంథమును ఆయన జీవితానంతరము, ఆయనకుమార్తె ద్వారా నేను సంపాదించ గలి గాను. ఆ గ్రంథమునకు రెండు కాపీలు తీయించుకొని వారి గ్రంథము వారికి తిరిగి అప్పగించియున్నాను ఆ గ్రంధములోని మంత్రములు, స్తోత్రములు మొదలైనవి శ్రీ వెంకయ్యగారు శ్రీగోవిందరాజు రామప్పగా పూర్వాశ్రమంలో పేరుగల శ్రీబ్రహ్మా నంద సరస్వతీస్వామివారు ఎనమలకుదురులో ఉన్న కాలంలో, ఆ స్వామివారి దగ్గరగల గ్రంథమునుచూచి వ్రాసికొనినట్లు వినికిడి.

1992వ సంవత్సరం జనవరి 14వ తారీఖున శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్‌గారిని దర్శించుకొనే అదృష్టము నాకు కలిగినది. వారి అనుగ్రహము వలన నాలోని దౌర్బల్యము

నశించి. మనస్సు స్థిరపడి ప్రశాంతమైనది. కొన్ని సల్లక్షణములు అబ్బినవి. అప్పటినుంచి వారిని కృతజ్ఞతాపూర్వకముగా తరచుగా సందర్శించుకొనుట జరుగుచున్నది. ఈ సందర్భములోనే శ్రీ విద్యాసాగరశర్మగారితో పరిచయభాగ్యముకూడా కలిగి వారికడకు గూడా తరచుగా పోయి దర్శించి వచ్చుచుండెడివాడను.

నా పూర్వజన్మ సుకృతమువలన, పెద్దల ఆశీర్వచనమువలన, నేను సంపాదించి కాపీ చేయించుకొన్న మంత్రగ్రంథమును ముద్రించవలయుననెడి సంకల్పము కలిగినది. శ్రీ విద్యాసాగర శర్మగారిని కలిసినప్పుడు గ్రంథమొసగి, గ్రంథమును పరిష్కరించి ముద్రణాకార్యము నిర్వహించవలసినదిగా ప్రార్థించితిని. వారికి నా అభిప్రాయము తెలిపితిని. ఆ తరువాత శ్రీ విశ్వయోగి విశ్వంజీ వారిని దర్శించి, నాకార్యక్రమము నిర్విఘ్నముగా నెరవేరునట్లు ఆశీర్వదించవలెనని కోరితిని. "దత్తమంత్రగ్రంథమును పరిపూర్ణ దత్తావతారులైన తమకే అంకితమీయవలయునన్న నా కోర్కెను దయచేసి మన్నించు"డని ప్రార్థించితిని. శ్రీ విశ్వయోగి విశ్వంజీ వారు తమ ఆమోదము వెల్లడించి కార్యము ప్రారంభించుడని దివ్యాశీస్సు లిచ్చి అనుగ్రహించినారు.

మా మాతాపితరులు శ్రీయుతులు గోవిందరాజు శేషమ్మ వేంకటకోటేశ్వరరావుగార్ల జ్ఞాపకార్థం, మా కుటుంబ సభ్యులైన శ్రీమతి పరమేశ్వరమ్మ (భార్య), శ్రీ రాధాకృష్ణమూర్తి (తమ్ముడు) శ్రీమతి హైమవతి (మరదలు), మా కుమారులు చిరంజీవులు రామకోటేశ్వరశర్మ, శేషగిరిశర్మ, వల్లీమనోహర్, ఉమాకుమార్,

మా తమ్ముడి కుమారుడు చి॥ తిరుమల కోటేశ్వరరావుల సహాయ సహకారములతో ఈ గ్రంథముద్రణాభారమును వహించుచున్నాను.

దత్తోపాసకులైన శ్రీ విద్యాసాగరశర్మగారి కృషి ఫలితముగా శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీగారి అనుగ్రహబలము వలన సకాలములో గ్రంథ ముద్రణము విజయవంతముగా ముగిసినది. గ్రంథమును సకాలములో అందముగా ముద్రించి యిచ్చిన శ్రీపతి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ మూర్తి గారికీ, వారి సిబ్బందికీ హృదయపూర్వకమైన కృతజ్ఞతలు వెల్లడిస్తున్నాను. దత్తజయంతి పర్వదిన సందర్భంగా, ఈ దత్తమంత్ర గ్రంథమును సంపూర్ణ దత్తావతారులైన శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీవారి అరుణారుణ చరణ కమలములకు పూజా ప్రసూనముగా సమర్పించుకొను అదృష్టము కలిగినందుకు ఎంతయో ఆనందించుచున్నాను.

మాకుటుంబ సభ్యుల కెల్లరకు సద్బుద్ధిని, సదాచరణమును ప్రసాదించి, లోకకళ్యాణమునకు పాటుపడగలందులకు మాకు కావలసిన శక్తి యుక్తులను ప్రసారముచేసి, సదా అనుగ్రహించుచుండవలసినదిగా శ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు మహారాజ్‌ను సవినయముగా ప్రార్థించుచున్నాను. ఓం శ్రీ సాయిరామ్ గురుదేవదత్త

సర్వేజనా స్సుఖినోభవంతు.

సత్యనారాయణ పురం,
విజయవాడ
12-12-1993.

ఇట్లు
విశ్వకుటుంబసభ్యుడు.
గోవిందరాజు దత్తాత్రేయులు.

# కృతజ్ఞతాభివందనములు

"దిగంబరాయ విద్మహే అత్రిపుత్రాయ ధీమహి
తన్నో దత్తః ప్రచోదయాత్"

ప్రతి మంత్ర గాయత్రి చెబుతున్నట్లుగానే దత్తగాయత్రికూడా తన తత్వాన్ని అర్థం చేసుకొని ఉపాసించమని చెబుతున్నది. మంత్రదేవత తత్వమేమిటో తెలుసుకోవటం ప్రతి ఉపాసకుడి ప్రథమకర్తవ్యం. దత్తుడు దిగంబరుడు. అవధూత. ఈ రెండు పదాల్లో దత్తతత్వమంతా ఇమిడిఉంది. దత్తతత్వాన్ని మనం వాక్కుతో విశదీకరించలేము మరొక వస్తుప్రకాశంలో దానిని గ్రహించాలనుకుంటే, అట్టి ప్రకాశమానమైన వస్తువు మరొకటి లేదు. అది సమస్త జ్ఞానము నుండి తనంత తాను ప్రకాశిస్తున్నదై ఉంది. అదే గురువు. దానిని తెలుసుకోవాలంటే సాక్షాత్కారం తప్ప గత్యంతరములేదు. అప్పుడది అద్వైతంగా అనుభవంలోకి వస్తుంది. అనాచ్ఛాదితమైన, శుద్ధ నిర్మలమైన అవధూత భావంలో అది దిగంబర మని చెప్పబడింది. అది ఆధ్యాత్మిక సాధనయొక్కపరాకాష్ఠ. కాబట్టి దానికి రక్ష అక్కరలేదు. దాని కదే రక్ష. అందుకే అది దిగంబర మని చెప్పబడింది దిగంబరమనేమాట రక్షలేకపోవటాన్నిసూచిస్తుంది దానితోబాటు సర్వజగద్రక్ష అనీ సూచిస్తుంది. అది దిక్కులే బట్టగా కలిగి ఉండటమే కాక. అన్ని దిక్కులకుకూడా బట్టయై యున్నది. దత్తాత్రేయుడు వ్యక్తి కాదు శక్తి స్వరూపం. ఇంకా విశేషించి చెప్పాలంటే శివశక్తి స్వరూపం. సర్వమంత్ర స్వరూపం. సర్వతంత్రస్వరూపం. సర్వ యంత్రస్వరూపం దత్తుడే. ఆయనేపరబ్రహ్మ. పరబ్రహ్మ వ్యక్తరూపమేదత్తుడు. దత్తుడే విశ్వం. ఈ విశ్వంలో దత్తుడు కాని దంటూ వేరే ఏమీ లేదు. ఈ

భావన ఒకే పరతత్వంలోని దైవత్వం యొక్క ఏకత్వం. ఈ ఏకత్వ గ్రహణాన్ని మనం ధ్యానం, ఉపాసన, జ్ఞానములద్వారా పొందవలసి ఉంది. దైవత్వం యొక్క ఏకత్వం ఎప్పటికైనా తెలియగల పరమసత్యం. ఈ సత్యదర్శనమే జ్ఞాన దర్శనము. అదే దత్తగురు దర్శనం. ఎవరు ఏ ఉపాసనామార్గాన్ని అవలంబించినా చివరికి చేరుకోవలసిన ఆఖరుమజిలీ అదే !

స్మరణమాత్ర సంతుష్టుడైన దత్తుణ్ణి ప్రసన్నం చేసుకోవటం ఎంత సులభమో, అంత కష్టం. ఆయన చెప్పిన యోగాన్ని అవలంబించాలనుకుంటే ముందు మనం మనమనస్సును స్థిరపరచుకోవాలి. కర్మ, భక్తి మార్గాలను యోగంగా మలచుకొని జ్ఞానంలో సంవిలీనం చెయ్యాలి. మంత్రం మానవుణ్ణి శక్తివంతుణ్ణి చేస్తుంది భిన్నత్వంలోఏకత్వదర్శనానికీ, విశ్వమానవసమైక్యతకూ దత్తోపాసన ఎంతగానో తోడ్పడుతుంది. శాంతి సౌఖ్యాలను ప్రసాదిస్తుంది. అందుకే దత్తుడు ఈ గ్రంథాన్ని ఇట్లా ఈనాడు వెలువరించాడు.

ఈ గ్రంథంలోని విషయాలేవి నా స్వంతం కావు. దత్తమైన వాటి నన్నింటినీ ఒకచోటికి చేర్చాను ఇదంతా దత్తుడు చేసిన పనే దత్తుడు నన్నొక ఉపకరణంగా చేసుకొని, సాత్వికమూర్తి శ్రీ గోవిందరాజు దత్తాత్రేయులుగారిని ప్రేరేపించి ఇట్లా మంత్రసుధను ప్రవహింపజేశాడు. అవధుల్లేని దత్తుని అనుగ్రహానికి పాత్రులైన శ్రీ దత్తాత్రేయులుగారు ధన్యులు. వారి జన్మ చరితార్థమైంది.

దత్తాత్రేయులుగారు నాకందచేసిన వ్రాతప్రతి పరిశీలించేప్పుడు, పారాలను పరిశీలించటానికి వీలుగా ఉండేందుకు తమదగ్గ

రున్న దత్తస్తోత్ర గ్రంథాలను అందచేశారు ప్రియమిత్రులు, విశ్వ కుటుంబసభ్యులు శ్రీ ఆకెళ్ళ మాణిక్యమూర్తిగారు–

చాలా శ్రమపడి శ్రీ దత్తాత్రేయ స్తోత్రావళితో బాటు శ్రీ బ్రహ్మానందసరస్వతి స్వామివారివని చెప్పబడుబడుతున్న రెండు పూజా విధులు నాకు అందచేశారు మా బావగారు, రిటైర్డ్ జిల్లా ఎంప్లాయిమెంటు ఆఫీసరు శ్రీ మారెళ్ళ సూర్యనారాయణరావు (M. S. రావు)గారు–

పాఠాలు సరిచెయ్యటంలో తమ అమూల్యమైన సలహాలు అందించారు ప్రియమిత్రులు, పండిత ప్రకాండులు శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు, శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగార్లు–

అడిగిన వెంటనే వాత్సల్యంతో "అమృతలహరి" ప్రవహింప చేశారు మా ప్రథమ గురువులు, ఆప్తమిత్రులు, అమృతహృదయులు డాక్టరు ప్రసాదరాయ కులపతిగారు –

"దివ్యానుభూతి" ప్రకటించి దివ్యాశీస్సులు ప్రసాదించారు. కారణజన్ములు శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీమహారాజ్ (శ్రీ విఠల్ బాబాజీ)గారు–

ఈగ్రంథముద్రణ నిర్విఘ్నంగాకొనసాగగలందుకు తొలుతనే దివ్యాశీస్సులు కురిపించి, ఈ గ్రంథాన్ని పూజాపుష్పంగా తమ పాదపద్మాలకు సమర్పించుకోవాలన్న మా కోర్కెను వాత్సల్యపూర్ణులై మన్నించారు సంపూర్ణదత్తావతారులు శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు మహారాజ్ –

వీరికందరికీ ఈగ్రంథావిష్కరణ శుభ సమయంలో హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పిస్తున్నాను. భక్తిప్రపత్తు

లతో వ్రాతప్రతి సిద్ధంచేసిన మా చిరంజీవులు, దత్తాత్రేయభార్గవనూ, సాయిదత్త నూ హృదయపూర్వకముగా ఆశీర్వదిస్తున్నాను.

సకాలంలో గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ప్రింటింగ్‌చేసి అందించారు శ్రీపతి ఆర్ట్ ప్రింటర్స్ గుంటూరు వారు– ఆ ప్రెస్ అధినేత శ్రీపతి పండితారాధ్యుల నాగలింగమూర్తిగారికి, మరియు ప్రెస్ సిబ్బందికీ–ముఖ్యంగా చి॥ గోపికి–నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాను

ఈ గ్రంధరచనకు–ముఖ్యంగా-నాకు శ్రీ పోతుకూచిశ్రీరామ మూర్తిగారి శ్రీ దత్తాత్రేయకల్పము, శ్రీ మోపర్తి గోపాలరావుగారి దత్తాత్రేయ తత్వము, శ్రీ పోతాప్రగడ వెంకటసుబ్బారావు గారి శ్రీగురు దత్తవైభవము, సంహితాయన గురుసంహిత తెలుగు అనువాదగ్రంథానికి రచయిత ఆచార్య ఎక్కిరాలభరద్వాజగారు వ్రాసిన పీఠిక, మైసూరుమహారాజ్ జయచామేంద్ర వడయార్‌గారి దత్తాత్రేయమొదలైనవి చాలా తోడ్పడ్డవి. ఆయాగ్రంధరచయితలకు కృతజ్ఞతాపూర్వకనమస్సుమాంజలులు సమర్పిస్తున్నాను.

శ్రీ గోవిందరాజు దత్తాత్రేయులుగారిచ్చిన వ్రాత ప్రతిలో ఇంకా చాలా స్తోత్రాలు ముద్రణ కావలసిఉన్నవి. త్వరలోనే దత్తుడి అనుగ్రహం వలన శ్రీ దత్తస్తోత్రసుధార్ణవము, శ్రీ దత్తాత్రేయ షోడశావతారాలు తమ కరకమలాలకు అందగలవని ఆశిస్తున్నాను ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త.

గుంటూరు
28–12–93

శ్రీ సాయిదత్తపాదపద్మ రజోలేశము
— విద్యాసాగర శర్మ

# విషయసూచిక



# శ్రీ దత్తమంత్ర సుధార్ణవము

## శ్రీ దత్తాత్రేయ స్తోత్రము



ఓం నమో బ్రహ్మాదిభ్యో
బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో
వంశర్షిభ్యో నమో గురుభ్యః ॥

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తం నమామి ॥

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరంబ్రహ్మా
తస్మై శ్రీ గురవే నమః ॥

కాషాయ వస్త్రం కరదండ ధారిణం
కమండలుం పద్మకరేణ శంఖం
చక్రం గదా భూషిత భూషణాఢ్యం
శ్రీ పాదరాజం శరణం ప్రపద్యే॥

ఔదుంబరః కల్పవృక్షః
కామధేనుశ్చ సంగమః
చింతామణి ర్గురోః పాదౌ
దుర్లభౌ భువనత్రయే॥

కృతే జనార్ధనో దేవః
త్రేతాయాం రఘునందనః
ద్వాపరే రామకృష్ణౌ చ
కలౌ శ్రీపాద వల్లభః ॥

మాలాకమండలు రధః కరపద్మయుగ్మే
మధ్యస్థపాణియుగళే డమరుత్రిశూలే
యస్యస్త ఊర్ధ్వకరయోః శుభశంఖచక్రే
వందే త మత్రివరదం భుజషట్కయుక్తం॥

శ్రీ దత్త శ్శరణం మమ
ఓం శ్రీ సాయిరాం గురుదేవ దత్త



# శ్రీ దత్తాత్రేయ తత్త్వరహస్యం

దత్తాత్రేయం శివం శాంతం ఇంద్రనీలనిభం ప్రభుం
ఆత్మామాయారతం దేవం అవధూతం దిగంబరం
భస్మోద్ధూళిత సర్వాంగం జటాజూటధరం విభుం
చతుర్బాహుం ఉదారాంగం ప్రఫుల్ల కమలేక్షణం
జ్ఞానయోగనిధిం విశ్వగురుం యోగిజనప్రియం
భక్తాను కంపినం సర్వ సాక్షిణం సిద్ధసేవితం
ఏవం యత్సతతం ధ్యాయేత్ దేవదేవం సనాతనం
ప్రముక్త స్సర్వపాపేభ్యో నిశ్శ్రేయస మవాప్నుయాత్ ॥"

(శాండిల్యోపనిషత్తు)

దత్త తత్త్వాన్ని మనకు పురాణేతిహాసాలూ, శ్రీ వాసుదేవానందసరస్వతీస్వామికృత దత్తాత్రేయ షోడశావతారాలూ, దత్త పురాణం, దత్తాత్రేయ స్తోత్రాలూ, దత్తాత్రేయ సహస్రనామాలూ, శాండిల్యోపనిషత్తూ, దత్తోపనిషత్తూ, అవధూతోపనిషత్తూ మొదలైనవన్నీ సమగ్రంగా వెల్లడిస్తున్నవి. ఎంత తెలిసినా తెలుసుకోవలసింది మరెంతగానో ఉంటుంది. సత్యం. జ్ఞానం, అనంతంగా పేర్కొనబడిన ఆ పరబ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవాలంటే శ్రీమన్నారాయణ తత్త్వస్వరూపుడైన ఆ దత్తాత్రేయుడికి ఒక్కడికే సాధ్యమౌతుంది. దత్తావతారులైన శ్రీశ్రీశ్రీవిశ్వయోగి విశ్వంజీ సద్గురుమహారాజ్ యొక్క మాటల్లో చెప్పాలంటే "సృష్టిస్థితిలయకారకమైన దివ్య శక్తియేదత్తశక్తి. అనంతశక్తిమయమై, విజ్ఞాన తరంగమయమై, విశ్వంలోని ప్రతి అణువణువునకూ శక్తిని ప్రసాదిస్తున్న ఆదత్తశక్తి అనంతము. అనిర్వచనీయము. ఎవరైతే సాధన చేత, శోధనచేతదాన్ని

స్వంతం చేసుకోవడానికి ప్రయత్నించేస్తారో వారి కది దత్త మౌతుంది. కనుక ఆ శక్తిని "దత్తశక్తి" అన్నారు ప్రతివ్యక్తి లోను హృత్‌శక్తిగా, చిత్‌శక్తిగా ఆత్మశక్తిగా వెలుగొందుతూ, ఇచ్ఛాశక్తిగా, జ్ఞానశక్తిగా, క్రియాశక్తిగా భాసిల్లుతూ, విష్ణు బ్రహ్మ రుద్ర సమైక్యరూపంగా, మనిషిలో తేజరిల్లుతున్న ఆదివ్యశక్తియే దత్తశక్తి ! ఆ శక్తితో సంబంధ మేర్పరచుకొని, ఆశక్తిని తనలో జాగృతం చేసుకొన్నవ్యక్తి దత్తరూపమే! "అత్రి" అనగా త్రిగుణములకు అతీతమై, త్రిపురములను (మూడు గ్రంథులను) ఛేదించుకొని, అనసూయను (అసూయరహితమైన తత్త్వాన్ని) స్వంతము చేసుకొన్నవ్యక్తి. అటువంటి వ్యక్తికి (సాధకుడికి) దత్తాత్రేయుడు దత్త మౌతాడు అందుకే దత్తుని "అత్రిఅనసూయల తనయు డని అనటం!"

## 1. అత్రి అనసూయలు – సాంకేతిక రహస్యం

"అత్రి" అన్నపదం సాధకుడికి ఒక సంకేతం. "ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థప్రకాశ్యతే" అని ఇతిహాసపురాణాలలోని కథ లన్నీ వేదాంతార్థాన్ని వ్యక్తం జేస్తుంటవి. ప్రాకృతులు కేవలం కథల కోసం, ఆనందం కోసం పురాణాలు చదివితే, జిజ్ఞాసువులూ, సాధకులూ, తత్త్వాన్వేషకులూ, సత్యదర్శనం కోసం, మూల తత్త్వాన్ని అర్థంజేసుకోవటం కోసం, పరమార్థాన్ని చేజిక్కించుకోవటం కోసం వాటిని పరిశీలిస్తారు, "ఆధ్యాత్మికాది తాపత్రయ రహితత్వేన "అత్రి" శబ్దవాచ్యో జీవన్ముక్తో కశ్చి న్మహర్షిః" అని అత్రి శబ్దం నిర్వచింపబడింది. "మూడు"కానివాడు (లేనివాడు)–

అ+త్రి—ఎవడో? వాడు అత్రి. సత్వరజస్తమోగుణాలూ, ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికాలనే తాపత్రయాలూ, బ్రహ్మగ్రంధి విష్ణుగ్రంధి రుద్రగ్రంథి అనే పేర్లతో పిలువబడుతున్న గ్రంథి(దోష) త్రయాలూ – ఈ మొదలైనత్రయాలేవీ లేని వాడు "అత్రి". అంటే వాటికి అతీతమైన స్థితియందున్నవాడని అర్థం. నీవు, నేను, అది అనే త్రయాన్ని అతిక్రమించిన మానసికస్థితిని పొందినవాడు— జ్ఞానాతీతుడు (వేదాతీతుడు)—అత్రి. ఆ అత్రి భార్యను అనసూయగా పురాణాలు పేర్కొన్నవి. అత్రి(సాధకుడి)లోని మానసికశక్తి అతనిభార్యగా – అనసూయగా – చెప్పబడింది. "అనసూయ" అంటే అసూయను వీడిన తత్త్వం. ఇంకా దీన్ని వివరించాలంటే అది జీవుడు మాయను వదలిన స్థితి. త్రిమూర్తులు పరీక్షార్థం అనసూయాదేవి దగ్గరకు వచ్చి "వివస్త్రవై భిక్ష పెట్టు"మని అడిగితే "ఆమె ఆప్రకారంగా చేసిం"దని మనపూర్వులు వేదాంత పరమైన ఈ విషయాన్నే ఒక చమత్కారకథగా పురాణాల్లో చెప్పారు. ఈకథేకాదు. మనపురాణాల్లోని కథలన్నీ ఇట్లాంటివే! జీవుడికి స్వస్వరూపజ్ఞానం కలుగనీయకుండా "మాయ" ఒక వస్త్రంలాగా అతణ్ణి కప్పివేస్తూ ఉంటుంది. ఆ మాయను గనుక తొలగిస్తే అప్పుడు అనసూయత్వం సిద్ధిస్తుంది. సాధకుడు అత్రిగా మారాలంటే అనసూయను మానసికసహధర్మచారిణిగా కలిగిఉండక తప్పదు. లేకపోతే అసలైనజ్ఞానం (ప్రజ్ఞానం) చేతి కందదు. శక్తి దత్తం కాదు.

కామక్రోధాది అరిషడ్వర్గం సాధకులకు ప్రతిబంధకంగా ఉంటుంటే మనపూర్వఋషులు దానిజోలికి పోక, అసూయనే తొలి

గించా లని ప్రధానంగా నొక్కిచెప్పటం చూస్తే మనకు ఆశ్చర్య మనిపిస్తుంది. ఎక్కడ గాయ ముంటే అక్కడే మందు వెయ్యా లనే విషయం మనపూర్వఋషులకు తెలిసినంతగా మరెవ్వరికీ తెలీదు అందువల్లనే వాళ్ళు "కామక్రోధ స్తథాలోభో మదో మోహశ్చ పంచమః మాత్సర్యం షష్ఠ మిత్యాహుః పైశున్యం సప్తమం తధా అసూయా త్వష్టమీ జ్ఞేయా ఇత్యేతా అష్టమా తరః (వరాహపురాణం") అని చెప్పారు. కామక్రోధాదులూ, పైశున్యం (కొండేలు చెప్పటం), అసూయ అనే ఈ ఎనిమిదీ ప్రతి జీవిని నిరంతరం ఆవరించి ఉంటవి. మానవుడికి కలిగే సర్వదుఃఖా లకూ ఈఎనిమిదే కారణం. రహస్య మేమిటంటే - ఈ ఎనిమిది పూర్ణపరిణామస్వరూపం అసూయ. ఈఅసూయను ఆధారం జేసు కొనే మిగతావన్నీ చిలవలు పలవలుగా తలెత్తుతుంటాయి. ఈ సృష్టిలోని ఉత్తమ జీవియైన మానవుడు ఒక విశిష్టధర్మాన్ని ఆచ రించవలసి ఉంది. దాని వల్లనే అతడు మానవు డనిపించు కొంటాడు, "ఆత్మోపమ్యేన భూతానాం దయా కుర్వీత మానవః" అని శాస్త్రము మానవుడు దయ (ప్రేమ+జాలి) కలిగి ఉండాలని శాసిస్తున్నది. సర్వభూతదయాళుత్వమే మానవత్వం. ఈ మాన వత్వం సంపాదించడమంటే అంత తేలికవిషయం కాదు. ప్రేమ, ద్వేషం అనేవి ద్వంద్వాలు. ఒకదానికొకటి విరుద్ధాలు. సర్వ భూతాలను కాదుగదా! ఏఒక్కమనిషినైనా మనం త్రికరణశుద్ధిగా ప్రేమించలేము. అట్లా ప్రేమించటం మనకు చాతకాకపోయినా ఆ మనిషిని మనం ద్వేషించకుండా ఉంటే చాలు. ఆ మనిషిమీద ఎప్పటికో ఒకప్పటికి ప్రేమ పుట్టుక వచ్చే అవకాశ ముంటుంది.

కనుక మనం ముందు ఇతరులను ద్వేషించట మన్నది మానాలి. ఎవరిమీదనైనా అసూయ కలిగినప్పుడే అతణ్ణి మనం ద్వేషిస్తాం. ఆ అసూయను మనలో చేరనీయకుండా ఉంచటమే, అనసూయను మానసికసహధర్మచారిణిగా చేసుకోవటం. ఈ అనసూయాత్వం మనలో విస్తరిస్తున్నకొద్దీ కామక్రోధాదులు వాటంతట అవే క్రమంగా అణగారిపోతుంటవి కామక్రోధాదులు నశించటంతో తాపత్రయాలు కూడా దూరమై, మనస్సు ప్రశాంతమై జీవన్ముక్తి కలుగుతుంది. కనుకనే సాధనలో మనపూర్వఋషులు అనసూయత్వానికి ఇంత పెద్ద పీట వెయ్యటం జరిగింది.

సాధకుడు అనసూయను మానసిక సహధర్మచారిణిగా చేసుకొన్నప్పుడు, సాధనాక్రమంలో- అతనిలోని తమోగుణం రజోగుణంలోకలవటం, ఆతర్వాత రజస్తమోగుణాలురెండూ తమప్రత్యేకతలను కోల్పోయి సత్వంలో సంవిలీనంగావటం, నిర్గుణయోగశక్తిని ఆసాధకుడు దత్తం చేసుకోవటం జరుగుతుంది. ఈ విషయాన్నే "దత్తుడు విష్ణువు యొక్క అంశతో జన్మించినప్పటికీ, ఆతర్వాత చంద్రుడు తనబ్రహ్మాంశనూ, దుర్వాసుడు తనరుద్రాంశనూ దత్తుడికిచ్చి యథేచ్ఛగా వెళ్ళా"రని పురాణాల్లో కథగా చెప్పబడింది. త్రిగుణాతీతుడైన దత్తుడియోగపరిణామక్రమాన్ని సూచించే పరమ రహస్యతత్త్వం ఇది ! ఎప్పుడో-ఇప్పటికి 75 కోట్ల సంవత్సరాలకు పూర్వం-స్వాయంభువ మన్వంతరంలో దత్తాత్రేయుడిద్వారా "యోగం" అనేస్థానం ఏర్పడింది కాబట్టే మనకీనాడు ఆయోగాన్ని పొందే అవకాశం లభించింది. లేకపోతే అహర్నిశలూ-అపరం

ధామంలో-ఆపరమాత్మను ఆశ్రయించిఉండే యోగశక్తి ఈసృష్టి లోకి దిగివచ్చి, మనకు అందుబాటులో ఉండేది కాదు. దత్తుడితో పాటు యోగంకూడా భువిపై అవతరించింది. ఇది దత్తావతారం మనకు ప్రసాదించిన మహత్తరవరం.

"అనసూయాదేవి పాతివ్రత్యాన్ని పరీక్షించాలని త్రిమూర్తులు ఆమె దగ్గరికి వచ్చా"రని చెబుతున్నకథను పరిశీలిస్తే-అది సాధనా దశలో సాధకుడిమనస్సును సత్వరజస్తమోగుణాలు పెట్టే పరీక్ష అనీ, ఆ పరీక్షలో నెగ్గితేనేగాని సర్వసృష్టికీ మూలమైన ఆమహాశక్తి మనకు దత్తంకాదనీ బోధపడుతుంది.

## 2. దత్తజననం – కథలు

దత్తాత్రేయులవారి జననానికి సంబంధించి పురాణాల్లో– ముఖ్యంగా రెండుకథలు మనకు కన్పిస్తాయి. మొదటిది-త్రిమూర్తులు తనను పరీక్షించడానికి వస్తే అనసూయాదేవి వాళ్ళను పసిపాప లుగా మార్చివేసిం దనేది. రెండోది-ఆతర్వాత అత్రిమహర్షికి బ్రహ్మాంశతో చంద్రుడూ, విష్ణ్వంశతో దత్తుడూ, రుద్రాంశతో దుర్వాసుడూ జన్మించా రనేది. ఈ రెండు కథలూ అత్రికి త్రిమూర్తులు "దత్తం" కావటాన్నే సూచిస్తున్నాయి. కాని పరమా ర్థాన్ని-వాచ్యంగా-వెల్లడించటంలేదు. శ్రీవాసుదేవానంద సరస్వతీ స్వామివారు దర్శించి వెల్లడించిన "శ్రీదత్తాత్రేయషోడశావతార కథనం" మరింత స్పష్టంగా దత్తతత్త్వాన్ని మనకు వెల్లడిస్తుంది.

ఆ షోడశావతార కథలను పరిశీలిస్తే - ఋక్షపర్వతంమీద అత్రి మహర్షి తపస్సుచేసుకొంటూంటే కార్తికశుద్ధ పౌర్ణమినాడు పరబ్రహ్మ ఆయన ముందు "యోగిరాజు"గా ప్రప్రథమంగా అవతరించాడనీ. ఆ యోగిరాజు కార్తిక బహుళ పాడ్యమినాడు "అత్రివరదుడు"గా (రెండో అవతారంగా) దర్శన మిచ్చాడనీ, మూడవ అవతారంలో అత్రి తపస్సుకు మెచ్చి, ఆ మహర్షికి దత్తమై "దత్త"నామం స్వీకరించాడనీ.... అట్లా అత్రికి దత్తమైన యోగిరాజు మార్గశిరశుద్ధపౌర్ణమి (చతుర్దశి?) నాడు, నాలుగో అవతారంలో "కాలాగ్నిశమన" గా అత్రిదంపతులకు ఔరసుడుగా (దత్తమవటం కాదు. కన్నకొడుకుగా) జన్మించాడనీ మనకు తెలుస్తున్నది. పైన చెప్పిన మూడో అవతారానికీ. నాలుగో అవతారానికీ మధ్య త్రిమూర్తులు పరీక్షించడానికి వచ్చి ఉంటారని మనం అనుకోవాలి. మొదటి మూడు అవతారకథలూ అత్రికి (సాధకుడికి) సృష్టిస్థితి లయాత్మకమైన దివ్యశక్తి ఎట్లా క్రమంగా దత్తమౌతూ వచ్చిందో తెలియచేస్తుంటే ఆతర్వాత అనసూయాదేవి పరీక్ష కథ అసూయారాహిత్యం వల్ల సాధకుడు తనకు కైవశమైన (దత్తమైన) శక్తిని ఎట్లా సుసంపన్నం చేసుకుంటాడో వివరిస్తుంది. నాలుగో అవతారంలోనికథ సాధకుడిలోని కుండలినీశక్తి సహస్రారం చేరటం (ఔరసుడుగా జన్మించడం) సూచిస్తుంది మూడవఅవతారం కార్తిక బహుళ విదియనాడు జరిగితే, నాలుగవ అవతారం మార్గశిర శుద్ధ సప్తమి నుండి పౌర్ణమి వరకూ - తొమ్మిదిరోజులూ తొమ్మిది నెలలుగా - అనసూయా గర్భంలోనే తేజోరూపంగా ఉంది. ఈ తొమ్మిది (నవ) అనే సంఖ్య "దత్తుడు పరాశక్తి" అనే

విషయాన్ని సాంకేతికంగా సూచిస్తున్నది. ఆయన జన్మించిన మృగశిరా నక్షత్రం ఆయనది శివ (జ్ఞాన) స్వరూపమనే విషయాన్ని వెల్లడిస్తున్నది. ఇంతకుముందే విశ్వశక్తి తనకు దత్తమైనప్పటికీ సాధకుడు (అత్రి) దాన్ని స్వంతం చేసుకొన్నరోజు మార్గశిరపౌర్ణమి (చతుర్దశి) కావటం చేత ఆరోజు సాధకులకు పర్వదినమై, దత్త జయంతిగా ప్రసిద్ధి కెక్కింది.

"చతుర్ధశ్యాం బుధే జన్మే మార్గశీర్షే శుభేదినే
తారకం విమలం వందే దత్తాత్రేయ నమోస్తుతే ॥

అని భృగుప్రోక్తమైన "దత్తస్తవరాజం" దత్తుడు మార్గశిరశుద్ధ చతుర్ధశినాడు జన్మించాడని చెబుతున్నది మైసూరు మహారాజా శ్రీ జయచామరాజేంద్రవడియార్‌బహదూర్ రచించిన "దత్తాత్రేయ" గ్రంథలోకూడా దత్త జననం చతుర్ధశీబుధవార మనే చెప్పబడింది. మరి దత్తాత్రేయుడు పౌర్ణమినాడు అవతరించినట్లా? లేక చతుర్దశి నాడా? అంటే - ఈ రెండూ నిజమే ననవలసివస్తుంది. చతుర్దశీ పౌర్ణమీ రెండూ కలసివచ్చిన (తిథిద్వయంగల) బుధవారంనాడు మార్గశిరమాసంలో దత్తుడు జన్మించాడని మనం అర్థంచేసుకోవాలి. ఆతర్వాత అవతారమైన "యోగిజనవల్లభ" ఆ మరుసటిరోజు- అంటే గురువారం – మధ్యాహ్నం ఏర్పడింది. ఆరోజు పౌర్ణమి కావటం గమనార్హం.

## 6. దత్తాత్రేయుడు ఏ యుగంలోని వాడు ?

దత్తుడు అవతరించింధి త్రేతాయుగంలో నని కొందరు భావిస్తున్నప్పటికీ, వాస్తవమాలోచిస్తే, ఆశక్తి ఒకమహాతేజోరాశిగా

(నక్షత్రరూపంగా) ఖగోళంలో అవతరించింది కృతయుగంలో నని స్పష్టమౌతుంది. శ్రీగురుసంహితా (శ్రీసంహితాయానగురుద్వి సాహస్రి) పీఠికలో బ్రహ్మశ్రీ వేమూరి దక్షిణామూర్తిగారు "కృత యుగే మాధవమాసి కృష్ణపక్షే దశమ్యాం దిషణ్యవాసరే ఋక్షే జుషే జుషాంకే దత్త స్త్రిమూర్తి స్స్వయ మావిరాసీత్" అని వ్రాశారు. ఈ శ్లోకం ఏ గ్రంథంలోనుంచి గ్రహించారో వారు చెప్పలేదు. కాని కొన్నిదత్తమంత్రలిఖితగ్రంథాల్లో ఈ శ్లోకం కనిపిస్తున్నది. ఈ శ్లోకాన్ని పట్టిచూస్తే కృతయుగంలో, ఒకానొక వైశాఖబహుళ దశమిగురువారంనాడు రేవతీనక్షత్రయుక్త మీనలగ్నమీనాంశలో త్రిమూర్త్యాత్మకుడై దత్తాత్రేయులవారు స్వయంగా అవతరించారని తెలుస్తున్నది, దత్తుడు సాక్షాత్తు బ్రహ్మకే గురువై ఉపదేశించటం (దత్తోపనిషత్తు) ప్రహ్లాదునికి యోగమార్గాన్ని బోధించటం ఈ మొదలైనవి దత్తుడు[1] కృతయుగంలోనివాడనటానికి బలం చేకూరుస్తున్నవి.

సృష్టిప్రారంభమైన మొదటి కృతయుగంలో – స్వాయంభువ మన్వంతరములో దత్తశక్తి తేజోరాశిగా (నక్షత్రంగా) ఖగోళంలో ప్రాదుర్భవించింది. బ్రహ్మ(చతుర్ముఖ) తనమొదటిసృష్టిగా సనకాదులనూ, ఆతర్వాత మరీచి, అత్రి మొదలైన మహర్షులనూ సృజించాడు అత్రిమహర్షి అనసూయను పెళ్ళిచేసుకొన్నాడు. (ఇదంతా కథాస్వరూపం. అప్పటివాళ్ళకి ఇప్పటి మనకులాగా

1. దత్తాత్రేయ వజ్రకవచంలో "భుజౌ పాతు కృతాదిభూః అనే పాఠం కనిపిస్తున్నది. ఇట్లే చాలాచోట్ల గలవు.

పాంచభౌతికశరీరాలు కావు. తేజోరూపా లని మనం గ్రహించాలి.) ఆతర్వాత స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుషమన్వంతరాలు జరిగాయి. చాక్షుషమన్వంతరం తర్వాతిదైన వైవస్వత మన్వంతరంలో మన మిప్పుడున్నాం ఒక్కొక్క మన్వంతరం గడవడానికి సుమారు 30.86 కోట్లసంవత్సరాలు పడుతుంది. ఆలెఖ్ఖన చూస్తే ఇప్పటికి 30.86×6=185.16 కోట్లసంవత్సరాలైంది—ఆ ఆరుమన్వంతరాలు గడచి. ఆధునిక శాస్త్రజ్ఞులు చెప్పే లెఖ్ఖప్రకారం సూర్యకుటుంబం పుట్టి ఇప్పటికి దాదాపు 500కోట్ల సంవత్సరా లౌతున్నది. భూమి పుట్టి 450 కోట్లసంవత్సరాలు. భూమిపై జీవదశ 200కోట్ల సంవత్సరాలనాడు ప్రారంభమైంది. ఈ ఆధునికశాస్త్రవేత్తలు చెప్పిన లెఖ్ఖ సరిగ్గా శ్వేతవరాహకల్పం ఆరంభంగానూ, జీవసృష్టికి ఆరంభంగానూ—మనపురాణకాలంతో—సరిపోతున్నది. ఆరు మన్వంతరాలపైన ఈసప్తమవైవవ్వత మన్వంతరరలో 12.6కోట్ల సంవత్సరాలు జరిగిందని మనపురాణాలు చెబుతున్నాయి. కనుక సైన్సు లెక్క సుమారు అంచనాయే గాని, ఖచ్చితంగా చెప్పింది కాదు కాబట్టి జీవసృష్టి 200కోట్లసంవత్సరాలనాడు జరిగిం"దన్నది మనపురాణాల ననుసరించి, శ్వేతవరాహకల్పంప్రారంభంనుండి నేటివరకూ జరిగినకాలంతో చక్కగా సరిపోతున్నది.

అయితే-ఇక్కడ మనం ఒకవిషయాన్ని గమనించవలసి ఉంది. 14మన్వంతరాలతరువాత, అప్పు డెప్పుడో రావలసిన నైమిత్తిక ప్రళయం (ముల్లోకాలునశించిపోయేప్రళయం) ఆరవదైన చాక్షుష మన్వంతరం చివర వచ్చినట్లు మనపురాణాల్లో చెప్పబడింది.

200కోట్ల సంవత్సరాలనాడు—మొదటి మన్వంతరంలో - ప్రారంభ మైన జీవసృష్టి, 14కోట్లసంవత్సరాలనాడు, జలప్రళయంలో నశించి పోయింది. మానవరూపం ఏర్పడి సుమారు 500 లక్షలసంవత్స రాలై ఉంటుం దని సైన్సు చెబుతున్నది అంటే జలప్రళయం తర్వాత భూమిపై సృష్టి పునఃప్రారంభమై క్రమక్రమంగా,కొద్దికాలం క్రితమే మానవదశకు చేరుకొన్న దని మనం భావించవచ్చు. జల ప్రళయానికి ముందు జరిగినసృష్టిపరిణామంలో మానవజాతి లేదు.

మనపురాణగాధల్లోనివాళ్ళు భూమిపై నున్న వ్యక్తులుగా చెప్పబడినా, దేవాసురులుగా పేర్కొనబడినా, యక్షకిన్నర కింపురుషాదిఊర్ధ్వలోకవాసులకు సంబంధించినవాళ్ళని చెప్పినా, ఆ కథలన్నీ ఖగోళపరిణామగాధలనుగూర్చి సాంకేతికంగా చెప్పబడిన వని మనం గ్రహించవలసిఉంటుంది అంతేగాని అవన్నీ భూమిపై జరిగిన వాస్తవికచరిత్రలు కావు. సైన్సు పరిబాషలో చెప్పాలంటే "Life generated from He'ium Atom" (హీలియం అణువే జీవశక్తికి మూలం.) "జీవోత్పత్తి మొదట నక్షత్రఅంతర్భా గాల్లోనూ, వాటికి ప్రక్కనేఉన్న శూన్యక్షేత్రంలోనూ ఆవిర్భ వించిదని" శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. అట్లాఏర్పడిన జీవశక్తి, మన భూగోళంపై కేవలం 200కోట్ల సంవత్సరాలనాడు ప్రారంభమై, మొట్టమొదట జలాంతర్భాగంలోనూ, తర్వాత భూమిమీదా ఏర్పడి, క్రమంగా వృక్షజంతుదశలు దాటి, 14కోట్ల సంవత్సరాలక్రిందట వచ్చిన జలప్రళయంలో అదంతా నశించి, 12.5కోట్లసంవత్సరాల నుండి జరుగుతున్న ఈ వైవస్వతమన్వంతరంలో మళ్ళీ సృష్టి ప్రారంభమై మానవదశకు చేరింది. దీన్ని బట్టి చూస్తే దత్తుడి

ప్రాదుర్భావం మహాతేజోవంతమైనశక్తి పుంజంగా–ఖగోళంలో–కృత యుగంలోనే ఏర్పడిం దని మనకు తెలుతుంది. మహానుభావ సంప్రదాయాన్ని (దత్త సంప్రదాయాల్లో ఇది ఒకటి) స్థాపించిన చక్రధరుడు తన "సూత్రపాఠవిచారము "అనే గ్రంథంలో దత్తాత్రేయుణ్ణి "చతుర్యుగావతారు"డని కీర్తించాడు.

## 4. దత్తాత్రేయుడు – నామవిశేషం

దత్త+అత్రేయుడు — ఈరెండుపదాలు కలసి దత్తాత్రేయుడైంది. నిజానికి "దత్తాత్రేయు"డని ఆయన్ను మనం పేర్కొనక్కరలేదు. "దత్తు"డన్నా "అత్రేయు"డన్నా సరిపోతుంది. దత్తుడంటే దత్తమైనవా డని అర్థం. ఆత్రేయు డన్నపదం అపత్యార్థకం. ఎవరి సంతానమో ఆపదం తెలియజేస్తుంది. అత్రికుమారుడు (దత్తుడుకాదు. ఔరసుడు) ఆత్రేయుడు. మనపురాణాల్లో బ్రహ్మ చంద్రుడుగా, విష్ణువు దత్తుడుగా, శివుడు దుర్వాసుడుగా పుట్టా రని ఉంది. కొన్నిపురాణాల్లోనైతే వాళ్ళు అత్రి మనస్సునుండి దత్తుడు, నేత్రం నుండి (చంద్రుడు), శరీరం నుండి (దుర్వాసుడు) పుట్టా రని ఉంది. కొన్నింటిలో వాళ్ళు అనసూయకే జన్మించా రని ఉంది. త్రిమూర్తులు అత్రికి దత్తం కావటంవల్ల ఆముగ్గురూ దత్తులే. ఆత్రికి జన్మించినందువల్ల ఆ ముగ్గురూ ఆత్రేయులే. వాస్తవానికి ఆముగ్గుర్నీ మనం దత్తాత్రేయు లనే పిలువవలసిఉంది. కాని విష్ణువుయొక్క అంశతో పుట్టినవాణ్ణిమాత్రమే దత్తుడూ, దత్తాత్రేయుడు అని మనం పిలుస్తున్నాం. (మనమేకాదు–అత్రిమహర్షికూడా అతనికి'దత్తు'డనేపేరు పెట్టినట్లు పురాణాల్లో ఉంది. మిగతాఇద్దర్నీ

వదలి–ఈయన్నే దత్తు డనటం ముఖ్యంగా మనం గమనించవలసిన విషయం] ఇది చాలా విచిత్రమైన విషయం "ఈచిక్కుముడి విప్పటం ఎట్లాగా ?" అని ఆలోచిస్తే –అసలు - ఆపదం దత్తాత్ర యుడా? దత్తాత్రేయుడా? అని సందేహం కలగటం కూడా సహేతుకమే. "దత్తాత్రయం" అంటే ఫర్వాలేదు గాని, దత్తాత్రయు డన్నప్పుడు "దత్తమైనత్రయంగలిగినవాడు,అత్రిమహర్షి "అని అర్థం వస్తుంది. కాని దత్తాత్రేయు డని అర్థం రాదు. "దత్తాత్రయం"అని (దత్తాత్రేయం అనేదానికిబదులు) కొన్నిమంత్రశ్లోకాల్లోకనిపిస్తున్నది. కాని లోకవ్యవహారంలో-గ్రంథాల్లో – దత్తాత్రేయు డనే ఉన్నది. రెండుపదాలకలయికతో–ఈదత్తాత్రేయపదం ఎట్లా ఏర్పడిం దని మనం విచారిస్తే, దేశకాలపరిస్థితులను మనం గమనించకుండా– ఇప్పటిలాగానే అప్పుడుకూడా పాంచభౌతికశరీరాలతో పుత్రులు జన్మించేవాళ్ళని అనుకోవడంవల్లనే ఈతికమక కల్గిందని అనిపి స్తుంది. అత్రికి కలిగినకుమారులు తేజోరూపా లని భావిస్తే చిక్కే లేదు. కృతయుగంలో-అప్పటికింకాభూమిమీద జీవసృష్టేజరుగలేదు. జరిగినదంతా ఖగోళంలోనే. ఆతర్వాత తత్సంబంధమైన జీవసృష్టి భూమిమీద మళ్ళీజరిగింది (విశేషాలుకావాలనుకొనేవాళ్ళు దక్షాదులు మళ్ళీ ద్వితీయసృష్టిగా ఎట్లా ఉద్భవించారో భాగవతంలోని చాక్షుషమన్వంతరకథ చదువుకోవచ్చు). దత్తాత్రేయషోడశావతార కథనంలో (కాలాగ్నిశమనఅవతారంలో) అత్రికి దత్తమైన యోగిరాజు (పరబ్రహ్మ) కుమారుడుగా జన్మించాడనీ, త్రిమూర్తుల వదనత్రయాన్ని ఆ కుమారుడిలో అత్రి సందర్శించాడనీ చెప్ప బడింది. దత్తాత్రేయుడు మొదట అత్రికి దత్తమై, ఆతర్వాత

ఔరసుడుగా (శక్తిస్వంతంకావటం) జన్మించాడని తెలియజేయటం కోసం "దత్తాత్రేయు"డన్నది లోకవ్యవహారంలో స్థిరపడిం దని మనం ఊహించడానికి వీలు కలుగుతున్నది.

**5. దత్త మంత్ర బీజం - విశిష్టత**

గాయత్రీమంత్రాన్ని విశ్వామిత్రు డెట్లా దర్శించి లోకానికి ప్రసాదించాడో, అట్లాగే అత్రిమహర్షి దత్తాత్రేయయోగశక్తిని దత్తం జేసుకొని (భూమిపైకి రప్పించి) లోకానికి ప్రసాదించాడు. దత్త మంత్రాల కన్నిటికీ శబరరూపియైనపరమేశ్వరుడు ఋషి. అంటే ఆమంత్రాలన్నీ ఆపరమేశ్వరుడిచేత ప్రోక్తములైన వని అర్థం. దత్తమంత్రానికి బీజం "ద్రాం"అని చెప్పబడింది, "దక్షిణామూర్తి బీజం చ రామబీజేన సంయుతం, ద్రామిత్యేకాక్షరం, జ్ఞేయం, బిందు నాదకళాత్మకం ఏతద్బీజం మయాప్రోక్తం బ్రహ్మవిష్ణుశివాత్మకం, వేదవ్యాసేన కథితం ప్రకారాంతర ముచ్యతే, దత్తస్యాది మంత్రస్య దాత్రేయస్యాదిమస్వరః" ఇత్యాదిగా పరమశివుడుపార్వతితోచెప్పినట్లు కలదు. దక్షిణామూర్తి శివస్వరూపం. అంటే జ్ఞానస్వరూపం.ఆవిధం గానే దత్తాత్రేయులవారుగూడా సాక్షాత్తు మూర్తీభవించిన జ్ఞానమే! దత్తాత్రేయుడూ శివుడూ ఒక్కటేనన్న విషయాన్ని "దత్తాత్రేయ హృదయం", "శాండిల్యోపనిషత్తు" మొదలైనవెన్నో వెల్లడిస్తున్నవి. "శాండిల్యోపనిషత్తు" మహేశ్వరుని (సదాశివుడన్నా, మహేశ్వరు డన్నా మనం త్రిమూర్తుల్లోని శివుడుగా భావించకూడదు ఆమాటకు వస్తే పరబ్రహ్మ లయకాలంలో శివుడుగా పిలువబడుతున్నా డని మనం గ్రహించవలసివస్తుంది ) వ్యక్తరూపమే 'దత్తా త్రేయు'డని (శాం. ఉ. 3-1) చెప్పింది.

"ద" లేక "దా" అనే బీజం వ్యాసప్రోక్త మని చెప్పబడింది. వ్యాసప్రోక్తబీజం ఐహికసుఖాలు ప్రసాదిస్తుంటే, శివప్రోక్తం జన్మ రాహిత్యాన్ని కలిగిస్తుంది. ఇదే ఆరెంటికీ ఉన్న తేడా కొన్ని గ్రంథాల్లో (మంత్రాల్లో) దత్త బీజం "క్రోం" అని ఉంది. ఈ విషయం కొంత పరిశీలించవలసిఉంది. "క్రోం అనేది అంకుశ బీజం. దీన్ని దత్తబీజ మనటంకంటే దత్తమంత్రానికి కీలకంగా సంభావించటం సమంజసమని తోస్తుంది.

'ద్రాం' బీజస్వరూపమైన దత్తాత్రేయుడిలో దక్షిణామూర్తి తత్వం ఉందని చెప్పటమేకాదు – అది తారకంగూడా – అగ్ని (జ్ఞానాగ్ని) బీజమైన రకారం. పాశబీజమైన "అం"(అసాధ్యాలనే బంధించగలమహాశక్తివంతమైన బీజం) కలసి, దత్తాత్రేయుడిలోని గురుతత్త్వాన్ని వెల్లడిస్తున్నవి.

బృహదారణ్యకంలో ఒకకథ ఉంది. రాక్షసులు, మానవులు, దేవతలు ఒకసారి ప్రజాపతి (బ్రహ్మ) దగ్గరకు వెళ్ళుతారు. అక్కడ బ్రహ్మలోనుంచి 'ద"అనేధ్వని వాళ్ళకి వినిపిస్తుంది. వాళ్ళు ఆశ్చర్యపోతూ, "దాని అర్థం ఏమైఉంటుం?"దని ఆలోచిస్తుంటారు. రాక్షసులు తమలో దయాగుణం లేదు కాబట్టి బ్రహ్మ తమను "దయను" స్వీకరించమని చెబుతున్నాడని'ద'అనే దానికి దయగా. అర్థం తీసుకొంటారు. అట్లాగే మానవులు "దాన"మనీ, దేవతలు "దమం" (అంతరింద్రియనిగ్రహం) అనీ అర్థం తీసుకొంటారు ఇంతటితోకథ అయిపోతుంది. ఈకథలో ఒక చమత్కార ముంది. రాక్షసులూ, దేవతలూ అనేవాళ్ళు ఎక్కడోలేరు. మషిని

హృదయంలోనే వాళ్ళు ఉన్నారు. సురీ, అసురీసంపద లంటే అవే! మనిషి మనిషిగా ఎదిగి మహామనీషిగా మారటమే అతడు దైవీ సంపదను పొందా డనడానికి గుర్తు. అట్లా మారడానికి ముందు మనలోని రాక్షసత్వాన్ని తొలగించి, మానవత్వాన్ని పెంచుకోవల సినఅవసరముంది. అప్పుడు గాని సాధకుడిసాధన ఫలోన్ముఖం గాదు. మొట్టమొదటగా దయను అలవరచుకొని,త్యాగాన్ని పాటిస్తూ, అంతరింద్రియనిగ్రహం కలిగిఉంటే, విశ్వశక్తి (పరబ్రహ్మ)దత్త మౌతుం దని చెప్పడానికే బృహదారణ్యకంలో ఆకథ చెప్పబడింది.

"ద్రాం"లోని 'ద'-పరబ్రహ్మతత్త్వమైతే, ఇకమిగిలిన "రాం" పరమాత్మతత్వం. యోగతత్త్వం. "రమయతీతి రామః"అని యోగులు నిరంతరం ఎవనియందు రమిస్తుంటారో, ఆఅత్మారాముడే 'రాం'లోని రాముడు. ఇది దత్తాత్రేయుడి యోగమార్గాన్ని వెల్లడి చేస్తుంది ఈ 'ద్రాం'అనే దత్తబీజానికి 'అం'శక్తి, 'క్రోం' కీలకంగా మంత్రశాస్త్రంలో చెప్పబడింది. ఈ బీజం సర్వమంత్రములకే కాదు, ఈవిశ్వమంతటికీ మహాప్రాణం. విశ్వశక్తి సమస్తం ఆబీజంలో నిక్షిప్తమై ఉన్నది.

## 6. దత్తాత్రేయుడు - విశ్వగురువు

దత్తాత్రేయుడిలో గురుదేవస్వరూపాలు రెండూ ఎట్లా సమ్మిళి తమై ఉన్నవో దత్తాత్రేయషోడశావతారాల్లో "అత్రివరదు"డనే ద్వితీయావతారంలో సమగ్రంగా వివరించటం జరిగింది. ఆయనకు కుడివైపు గురుస్వరూపం. ఎడమవైపు దైవస్వరూపం ఆయన అజ్ఞానాన్ని తొలగించి, భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శింపజేసి, ఆత్మ

సంప్రదాయం ఇదే! మహాత్ములచర్య లెప్పుడూ మార్గదర్శకాలు గానే ఉంటాయి. "యద్య దాచరతి శ్రేష్టః తత్త దేవేతరేజనాః" అని భగవద్గీత. మనంకూడా గురువును సాక్షాత్ పరబ్రహ్మస్వరూ పంగా భావించి, గురుభక్తి కలిగిఉండాలని దత్తుడు తనచర్యల ద్వారా మనకు వెల్లడించాడు. దత్తసంప్రదాయంలోని విశేష మేమిటంటే దత్తుడు వేరేలేడు. గురువే దత్తుడు ఈ గురుభక్తి వైశిష్ట్యాన్నే దత్తసంప్రదాయగ్రంథాలన్నీ ముక్తకంఠంతో ఉద్ఘాటిస్తున్నాయి

ఇకపోతే దత్తుడికి 24మంది గురువు లున్నారని మనం చెప్పు కున్నాం. ప్రకృతిలోని 24 అంశలే ఆ గురువులు, అంటే అవి మనస్థూలసూక్ష్మశరీరాల్లోని శక్తులే. మనస్థూలదేహం పాంచభౌతిక మైంది. అంటే అది పృథివి, నీరు, అగ్ని, వాయువు. ఆకాశం అనే పంచభూతాలతో కూడింది సూక్ష్మదేహం (Astro body) జ్ఞానేంద్రియాలనూ, కర్మేంద్రియాలనూ పనిచేయించే పదెరకాలైన శక్తులూ, రూప, రస, గంధ, స్పర్శ, శబ్దా లనే తన్మాత్రలు ఐదూ మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారము అనే అంతఃకరణవృత్తులు నాలుగూ, మొత్తం 19 శక్తుల కలయికతో సూక్ష్మశరీరం ఏర్పడు తుంది. సూక్ష్మశరీరమంటే వేరే ఏమీకాదు. మన మానసికప్రాణ శక్తుల కలయికే. ఈ 24 అంశలలో అంతర్లీనంగా పరమాత్మ (అవ్యక్తం) ఉన్నాడు. ఈ 24అంశలనుండి అవ్యక్తాన్ని సాధించ టమే యోగం ఈ విషయాన్ని వ్యక్తం చేయడానికే దత్తుడికి 24 మంది గురువు లని చెప్పటం జరిగింది. (ఒక్కొక్క అంశనుం

అవ్యక్తాన్ని సాధించి ఎట్లా జీవన్ముక్తి సాధించాలో సూచిస్తూ దత్తుడు 24 శ్లోకాలతో జీవన్ముక్త గీత చెప్పాడు. ఆ24 శ్లోకాలను ఈదృష్ట్యా మనం పరిశీలింపవలసి ఉంది.) గాయత్రీమంత్రంలోని 24 బీజాలు ఈ ప్రకృతిలోని అంశలే(శక్తులే). గాయత్రీశక్తికీ దత్త శక్తికీ పేరులోనేగాని శక్తిలో భేదం లేదు. విశ్వకేంద్రంనుంచి నేరుగావస్తున్నశక్తి దత్తశక్తిఐతే, సూర్యుని ద్వారా విశ్వకేంద్రం (ఖగోళం) నుంచి వస్తున్నసౌరశక్తి గాయత్రి. గాయత్రిని ఒక్క ద్విజులే ఉపాసించేవాళ్ళు పూర్వం. (ప్రస్తుతం స్త్రీలతోబాటు అన్ని వర్ణములవారు ఈ మంత్రాన్ని ఉపాసిస్తూఉండటం సంతోషకరమైన విషయం) దత్త మంత్రం ఆలోటు తీర్చి అన్నివర్ణముల వారికి ఉపాసనాయోగ్యమై వెలసింది. ఒకవిధంగాచెప్పాలంటే గాయత్రికంటే దత్త మంత్రంయొక్కశక్తి మహత్తర మైందని చెప్పవచ్చు గాని ఈ తరతమభేదాలు అమృతత్వానికి ఉండవు. అమృతం ఒక బిందెడైనా ఒక బిందువైనా ఇచ్చేది అమృతత్వమే ! గురుగాయత్రిలో దత్తుణ్ణి "గాయత్రీశుడు"గా మహర్షులు పేర్కొన్నారు. దత్తబీజాన్ని గాయత్రీసంపుటీకరణంతో జపించేసంప్రదాయంకూడా ఒకటి ఉన్నది. దీన్ని బట్టిచూస్తే పరమంత్రమైన గాయత్రితో సరిపోల్చ గలది దత్తమంత్ర మొక్కటే నని మనకు విశదమౌతుంది.

బ్రహ్మవిద్యనూ, శ్రీవిద్యనూ, యోగవిద్యనూ లోకానికి ప్రసాదించిన అజ్ఞానతిమిరాంధవివస్వంతుడు విశ్వగురువు శ్రీదత్తాత్రేయుడు. "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః" అన్నశ్లోకంత్రిమూర్త్యాత్మకుడైన శ్రీ దత్తాత్రేయస్వామివారిస్వరూప స్వభావాలను

వెల్లడిస్తూ చెప్పిన మంత్రగర్భితధ్యానశ్లోకం. మనం ఈలోకంలోని గురువులనందరినీ దత్తస్వరూపంగా భావించాలనీ, గురుశబ్దవాచ్యుడైనవాడు ఒక్కదత్తుడేననీ ఈ శ్లోకం మనకు బోధిస్తున్నది. ఎక్కడ విద్యుద్దీపం వెలిగినా, దాన్ని వెలిగించేది విద్యుచ్ఛక్తే నన్నమాటను మనం మరచిపోగూడదు. ఎక్కడ ఏ గురువు అజ్ఞానాన్ని పటాపంచలు చేస్తున్నా, దీపస్తంభంలా విరాజిల్లుతూ మార్గదర్శకత్వం వహిస్తున్నా ఆగురువులందరిలో అంతర్భూతంగా ఉండి పని చేయిస్తున్నమహాశక్తి జ్ఞానస్వరూపుడైన దత్తుడిశక్తే. అందుకు సందేహం లేదు. దేహాతీతంగా గురుస్వరూపాన్ని మనం క్రమక్రమంగా దర్శించటం అభ్యాసంచేస్తే, గుణరహితుడూ, రూపరహితుడూ అయిన ఆగురుతత్త్వం మనజ్ఞాన చక్షువుకు గోచరిస్తుంది. భిన్నత్వంలో ఏకత్వదర్శన మౌతుంది. సత్యం సాక్షాత్కరిస్తుంది. అప్పుడు మాగురువు, మీగురువు అన్న సంకుచితత్వం తొలగి, సమదర్శన మౌతుంది-ఏగురువుదగ్గరికి వెళ్ళినా, ఏ దేవుణ్ణి సందర్శించినా అది తనగురుస్వరూపమేనన్న అంతర్దృష్టి అలవడుతుంది.

షోడశావతారాల్లో "ఆదిగురువు"అవతరించింది ఆషాఢపూర్ణిమ కావటంవల్ల ఆపూర్ణిమ గురుపూర్ణిమ అయింధి. అంతేకాని వ్యాసుడి పుట్టుకకూ, వ్యాసపూర్ణిమకూ ఏమీసంబంధంలేదు. వ్యాసుడు గురుపీఠంలోనివాడే గనుక–దత్తుడివిషయం మరిచిపోయి–గురుపూర్ణిమ అన్న పేరువ్యాసుడివల్లనే వచ్చిం దనుకొని, అదివ్యాసపూర్ణిమ అని కొంతమంది భావించిఉండవచ్చు. ఆరోజునుంచే సన్యాసులు చాతుర్మాసదీక్ష తీసుకునే సంప్రదాయ మొకటి ఉండటం, అట్లా వాళ్ళు భావించిన దానికి బలం చేకూర్చి ఉండవచ్చు. ధ్యానం చేసే

వాళ్ళకు పూర్ణిమ చాలా పర్వదినం. దత్తుడిది ధ్యానమార్గం. దత్త సంప్రదాయంలో పౌర్ణమికి చాలాప్రాధాన్యత ఉంది. షోడశావతారాల్లో చాలా అవతారాలు పౌర్ణమినాడు ఏర్పడ్డవే! రహస్యం చెప్పాలంటే దత్తసంప్రదాయంలోని వాళ్ళందరికీ ప్రతిపౌర్ణమి ఒక దత్తపౌర్ణమే !

దత్తుడు బ్రహ్మకూ (దత్తోపనిషత్తు, మంత్రవిద్య)ప్రహ్లాదుడికీ (ఆధ్యాత్మవిద్య), వశిష్ఠుడికీ (యోగవిద్య) పరశురాముడికీ (శ్రీవిద్య), కార్తవీర్యార్జునుడికీ (ఆత్మవిద్య), అలర్కుడికీ, (యోగవిద్య), ఆయువుకూ, యదువుకూ, పింగళనాగుడికీ, శ్రాద్ధదేవుడికీ, ఇంకా అనేకమందికి ఆత్మవిద్యా, యోగవిద్యా నేర్పాడు. ఈ కలియుగంలో జ్ఞానేశ్వరుడికీ, చాంగదేవుడికీ తుకారాంకూ, సమర్ధరామదాసుకూ, శ్రీధరస్వామికి ఇంకా చాలామందికి ప్రత్యక్ష దర్శనమిచ్చాడు. కలియుగంలో శ్రీపాదవల్లభుడుగా, శ్రీనరసింహ సరస్వతీస్వామిగా, మాణిక్యప్రభువుగా, అక్కల్‌కోట మహారాజుగా, షిర్డీసాయిబాబాగా. గజానన మహారాజుగా, తాజుద్దీన్‌బాబాగా ఇంకా అనేక సద్గురురూపాలుగా వెలసి జ్ఞానబోధ చేశాడు. ఇప్పుడుగూడా అనేక స్వరూపాలుగా వెలసి, తన మహిమలు ప్రదర్శిస్తూ, భిన్నత్వంలో ఏకత్వాన్ని సందర్శింపజేస్తున్నాడు.

## 7. దత్తాత్రేయుడి స్వరూపస్వభావాలు

దత్తాత్రేయు డనంగానే మూడుముఖాలూ, ఆరుచేతులూ, వెనుక కామధేనువూ, ఔదుంబర వృక్షం, ముందుభాగంలో నాలుగు కుక్కలూ గల దేవతాస్వరూపం మనకళ్ళకు పొడగట్టుతుంది.

బ్రహ్మవిష్ణు మహేశ్వరులే మూడు శిరస్సులుగా, ప్రజ్ఞానమే దేహంగా షట్‌శాస్త్రాలే హస్తాలుగా, అవిద్యను దరిజేరనీయనివేదాలే కుక్కలుగా. ధర్మమే గోవుగా, విశ్వశాంతియే ఔదుంబరంగా, ఆత్మజ్ఞాన ప్రబోధార్థం యోగేశ్వరుడుగా ఆవిర్భవించిన మహాచైతన్యంయొక్క షోడశకళాపూర్ణమైన వ్యక్తస్వరూపమే దత్తప్రభువు.

కాని సూక్ష్మంగా విచారిస్తే పైనచెప్పిన పేర్కొన్నరూపం అత్రివరదుడిదేగాని దత్తాత్రేయుడిది కాదనిపిస్తుంది వాస్తవానికి దత్తాత్రేయుడు ఏకముఖుడు. ద్విభుజుడు. కొన్నిచోట్ల దైవత్వప్రకటనార్థం చతుర్భుజుడుగాకూడా కనిపిస్తాడు. శాండిల్యోపనిషత్తు" చతుర్బాహు ముదారాంగం"అని దత్తుడికి నాలుగుచేతు లని చెప్పింది. "సాధకః ప్రాత రుత్థాయ కృత శౌచక్రియ స్స్మరేత్, ఆత్రేయం బ్రహ్మరంధ్రస్థం। ద్విభుజం గురురూపిణం" అనీ, "యోగారూఢం యోగపట్టేన వీతం హస్తద్వంద్వం జానుయుగ్మే ప్రసార్య"అనీ ఇత్యాదిగా మంత్రధ్యానశ్లోకాల్లో చాలాచోట్ల దత్తుడికి రెండే చేతులున్నట్లు భావించటం జరిగింది అద్వైతమాలా మంత్రంలో "వరాభయకరం దేవం సచ్చిదానంద విగ్రహం"అనీ, వజ్రకవచంలో"వామహస్తేన వరదం దక్షిణే నాభయప్రదం"అనీ ఆయనవామ హస్తం వరదహస్తమనీ, దక్షిణహస్తం అభయహస్తమనీ ప్రకటించటం జరిగింది. శ్రీవాసుదేవానందసరస్వతీస్వామివారు పూజించిన దత్తవిగ్రహం ఏకముఖం, వరాభయకరాలు కలిగి, సిద్ధాసనంలో ఉన్న దత్తమూర్తికావటం గమనార్హం దత్తుడి జన్మభూమిగా ప్రసిద్ధిగాంచిన నేపాల్‌లోని "భటంగాన్"లో, అనసూయాపర్వతం మీద దత్తమందిరం ఒకటి ఉంది. ఆ మందిరంలోని దత్త

విగ్రహానికి ఒకముఖం, రెండుచేతు లున్నాయి. ఆదిదత్తాత్రేయుడుగా ఆమూర్తిని సంభావిస్తారు మూడు శిరస్సులున్న దత్తమూర్తిని ఆరాధించట మన్నది ఇటీవల మూడు నాలుగువందల సంవత్సరాలనుంచి ప్రారంభమై ఉంటుందని పరిశీలకులు భావిస్తున్నారు. ఇప్పటికీ దత్తసంప్రదాయంలోని ఒకవర్గం మూడుశిరస్సులున్న దత్తాత్రేయుణ్ణి ఆరాధించటం మహాపాపంగా భావిస్తుంది. కాని దత్తాత్రేయులవారు త్రిమూర్త్యాత్మకమైన పరబ్రహ్మస్వరూపమని వ్యక్తంచెయ్యటానికి (లేదా అత్రికి త్రిమూర్తులుదత్తమైనారన్న విషయం స్పష్టం చెయ్యటానికి) మూడుశిరస్సులూ, ఆరుచేతులూ గల దత్తరూపం వెలసింది, ఈమూర్తిభేదాలను మనం అధిగమించి, దత్తుడు మనకు బోధించిన యోగాన్ని (నిర్గుణతత్వాన్ని) పట్టుకుంటే అనూహ్యమైన శక్తి మనకు దత్తమౌతుందని గ్రహించి, అట్లా ఆచరించటం మంచిది.

దత్తాత్రేయుడు స్మరణమాత్ర సంతుష్టుడు. ఆయనకు మంత్ర తంత్రాలతో, నియమబాహుళ్యాలతో పనిలేదు - ఆయన నామ స్మరణమే ఒక మహా మంత్రం. 'దత్తదత్త'అన్న సంకీర్తనమే—ఆ ధ్యానమే—పరమార్థాన్ని ప్రసాదిస్తుంది. ఒక్కసారి ఆయనను మనసారా తలిస్తే నే చాలు. ఆయన దర్శనమిస్తాడు. ఈవిషయం మనకు దత్తాత్రేయవజ్రకవచం సవిస్తరంగా వెల్లడిస్తున్నది. దత్తాత్రేయుడు "స్మర్తృగామి" (స్మరించినవాళ్ళ దగ్గరకు పోయి దర్శనమిచ్చేవాడు) అన్నమాట ఎంతవరకు నిజమో? పరీక్షించాలని తనను స్మరించిన దలాదనమహర్షి దగ్గరకు దత్తప్రభువు వెళ్ళి "మమప్రకృతి రీదృశీ, స్మర్తృగామీ నసందేహో ద్వినప్తభువనే

ష్వహం, అభక్త్యా వా సుభక్త్యా వా యత్స్మరే న్మా మనన్యధీః తదానీ మహ మాగమ్య దదామి తదభీప్సితం'' నాస్వభావం నీవను కొన్నటువంటిదే! నేను స్మర్తృగామి ననటంలో సందేహించవలసిన పనిలేదు భక్తి ఉన్నా, లేకపోయినా, అనన్యబుద్ధితో ఎవరు నన్ను స్మరిస్తే నేను వాళ్ళదగ్గరకి పోయి, వాళ్ళ కోరికలను తీరుస్తాను. నారాక ఎప్పుడూ వృధాకాదు." అని ఆమహర్షికి తనవ్రజకవచాన్ని ఆయన ఉపదేశించాడు. దత్తప్రభువులో ఉన్న మరొక విశేష మేమిటంటే ఆయన "భక్తకీర్తి వివర్ధనుడు". తన మహిమను చూపటం కంటే తన భక్తులమహిమలను అతిశయించేటట్లు చేయాలనీ, వాళ్ళకీర్తిని విస్తరింపజేయాలనీ ఆయన అకాంక్షిస్తుంటాడు. ఆయన భుక్తిముక్తిప్రదాత. ఆయన భక్తుల కెల్లప్పుడూ స్వాధీనమై వాళ్ళవాక్కును వేదవాక్కు చేస్తుంటాడు తనకూ తన భక్తులకూ భేదం లేదని నిరూపిస్తుంటాడు. ఇది నాన్యతోదర్శనీయం.

ఒకప్పుడు బాలుడుగా, ఒకప్పుడు కుమారుడుగా, ఒకప్పుడు తరుణుడుగా, ఒకప్పుడు వృద్ధుడుగా, ఆయన ఉంటాడు ఒకప్పుడు తలపైని జడ లుంటవి. ఒకప్పుడు సిగలుంటవి. ఒకప్పుడు మద్య పాత్ర ధరించి, దివ్యాంగనాలింగితుడై, మదవిహ్వలాక్షుడై ఉంటాడు. ఒకప్పుడు బంగారువన్నెగలశరీరంతో, చిత్రవిచిత్ర మాల్యాంబరాలతో శోభిల్లుతుంటాడు. ఒకొక్కప్పుడు కల్లుత్రావుతూ, శరీరంనిండా బూడిద పూసుకొని, దిగంబరుడై తిరుగుతుంటాడు

మందారమూలే మణిపీఠసంస్థం<br>
సువర్ణదానైక నిబద్ధ దీక్షం<br>
ధ్యాయేత్ పరీతం నవనాద సిద్ధైః<br>
దారిద్ర్య దావానలకాలమేఘం"

మందారవృక్షం....దాని క్రింద ఒక మణిపీఠం. దానిపై ఆసీనుడైన దత్తస్వామి. ఆయనజడలో మల్లెలు....మొల్లలు.... జాజులు, మెడలో మణిహారములు .... ఫణిహారములు. మొలలో బంగారు మొలతాడు. వామాంకమున యోగలక్ష్మియైన అనఘా (మధుమతీ) దేవి, వెనుక కామధేనువు. నాలుగువైపులా కుక్కల రూపంలో ఉన్నవేదాలు. స్వామివారిని సనకసనందనాదిసాధు సత్తములూ, యోగులూ, మహర్షులూ, నవనాథులూ మొదలైన వాళ్ళంతా పరివేష్టించిఉంటారు పాశము, అంకుశము, పరాశక్తి, వాగేశ్వరి, కామేశ్వరి, భువనేశ్వరి, శ్రీదేవి, భూతజాలము, అష్ట సిద్ధులు, ఐశ్వర్యములూ, దేవతలు, దానవులు ఆయనముందు చేతులు జోడించి నమస్కరిస్తూ ఉంటారు. వరదులైన దత్తాత్రేయుల వారు భక్తుల కోర్కెలను అనుగ్రహిస్తుంటారు. ఆస్వామి శంఖ చక్రాలనూ, గదాపద్మాలనూ, డమరుత్రిశూలాలనూ, మాలాకమండ లాలనూ ధరించి ఉంటారు. అత్రిమహర్షి, అనసూయాదేవి ఒక ప్రక్కన, దుర్వాసుడూ, చంద్రుడూ మరోప్రక్కన కూచోని దత్త వైభవాన్ని వీక్షిస్తూ ఉంటారు. గంధర్వులు గానంచేస్తుంటే అప్సరసలు నాట్యంచేస్తుంటారు. ఈవిధంగా నైమిశారణ్యంలో దత్తాత్రేయులవారికొలువు ఉందని బ్రహ్మాండపురాణంలో వర్ణించ బడింది. ఈవర్ణన దత్తాత్రేయులవారి పరబ్రహ్మతత్వాన్నీ, గురు స్వరూపాన్నీ, విశ్వరూపాన్నీ వెల్లడిస్తున్నది. దత్తాత్రేయుడు ఎట్లా ఉంటాడో? తెలుసుకోవాలనుకొనేవాళ్ళు "దత్తాత్రేయవజ్రకవచం" లోని ధ్యానం ఒకసారిచూస్తే బోధపడుతుంది ఇంకా దత్తమంత్రా ల్లో, స్తోత్రాల్లో ఆయనవర్ణనఉంది. దత్తుడి స్వరూపస్వభావాలు

వర్ణించాలంటే అది మనశక్తికి మించినపని. "ఓంకారం ప్రత్యగాత్మానం పరబ్రహ్మస్వరూపిణం, పరమాత్మాన మవ్యక్తం"అని నమస్కరించటంకన్నా మనం చేసే దేమీ లేదు.

"యస్యాస్తి మహూరే నిద్రా, వాస స్సహ్యాపర్వతేః,
భాగిరథ్యాం సదా స్నానం, ధ్యానం గంధర్వపత్తనే,
కురుక్షేత్రే చాచమనం, ధూతపాపేశ్వరే తథా
విభూతిధారణం, సంధ్యా కరహాటే, శ్రియఃపురే
భిక్షా, విఠలపురస్య సుగంధద్రవ్యధారిణం
భుక్తి స్సారపురే, సాయంసంధ్యా పశ్చిమసాగరే"

దత్తాత్రేయుడు సహ్యాద్రినివాసి. రాత్రిసమయంతో మాహూర్ గడ్‌లో (మాతాపురంలో) శయనిస్తాడు. ఉదయస్నానం కాశీలో గంగానదిలో చేసి, కురుక్షేత్రంలో ఆచమనంచేసి, గిర్నార్, గాణగాపూర్‌లలో మాధ్యాహ్నికం నెరపి,ధూ తపాపేశ్వరంలో భస్మ ధారణ కావిస్తూ, కర్ణాటకంలో సంధ్యావందనంచేస్తూ, కోల్హాపురంలో (కరవీరపురంలో) భిక్షను అర్థిస్తూ, పండరీపురంలో తిలక ధారణం చేస్తూ, పాంచాలేశ్వరంలో భుజిస్తూ, తుంగభద్రలో నీళ్ళు త్రాగుతూ, బదరీనారాయణంలో శ్రవణం జరుపుతూ, గిర్నార్‌లో విశ్రాంతితీసుకొంటూ, సాయంసంధ్యావందనం పశ్చిమసముద్ర తీరంలో జరిపిస్తుంటా డని పురాణాలు ప్రవచిస్తున్నాయి. ఇందువల్ల ఆసేతు శీతాచలం దత్తుడు ప్రతిరోజు తిరుతూ ఉంటాడనీ, దత్తుడి పాదస్పర్శతో పునీతంగానిప్రదేశమంటూ భారతదేశంలో లేనేలేదనీ, యోగ్యులైనసాధకులకు ఆయన నిత్యం దర్శనమిస్తూ, అనుగ్ర

హిస్తూ ఉంటాడని మనకు స్పష్టమౌతుంది. దత్తుడివల్లనే భారత భూమి "యోగభూమి"గా ప్రసిద్ధి గాంచింది.

## 8. దత్తాత్రేయుడు - పంచమాశ్రమం

చతుర్విధ పురుషార్థసాధనకై మానవజీవితంలో బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ. సన్న్యాసాశ్రమము లనే చతుర్విధాశ్రమములు నెలకొల్పబడినవి దత్తాత్రేయులవారు ఈనాలుగుఆశ్రమాలకూ అతీతంగా ఉండటం మనం గమనిస్తాం. ఒకసారి దత్తాత్రేయుడి వేషం చూచి పింగళినాగుడు ఆశ్చర్యపడి (షోడశావతారాల్లో 13వ అవతారంలో ఈవృత్తాంతము వివరించబడింది)" మీదే ఆశ్రమం?" అని ప్రశ్నిస్తే, దత్తుడు సమాధాన మిస్తాడు, ఆ సమాధానం వింటే దత్తుడి యోగపద్ధతి, ఆయన ధ్యేయం మనకు బోధపడుతుంది. "ఈ నాఆశ్రమాన్ని గురించి ఇంతకు ముందెన్నడూ నీవు కని విని ఉండవు. చతుర్విధాశ్రమాలకంటే నాఆశ్రమం భిన్న మైంది. ఈ ఆశ్రమంలోని వాళ్ళంతా జగత్తును తన ఆత్మగా సందర్శిస్తుంటారు. త్రిగుణాతీతులై, నిస్సంగులై ఉంటారు. వాళ్ళకు వేదమంత్రాలు తెలీవు. తంత్రం తెలీదు. పరతత్వమున సదా మునిగిఉంటారు', అని చెప్పాడు. దత్తాత్రేయుడు చెప్పిన ఆశ్రమం అవధూతాశ్రమం. దత్త సంప్రదాయంలోనివాళ్ళంతా "దత్తోఽహం"అని నిరంతరం ధ్యానిస్తూ తామే అవధూతగా(దత్తస్వరూపంగా)మారిపోతారు. దత్త యోగులందరూ అవధూతలే. అవధూతస్థితి అందుకున్న ప్రతివ్యక్తి సాక్షాత్తు దత్తాత్రేయుడే అవుతాడు. దత్తాత్రేయులవారు ప్రవచించిన అవధూతగీతలో అవధూతలక్షణా లన్నీ చెప్పబడ్డవి. ఆవివరాలు మంత్రకల్పంలో మనం గ్రహించవచ్చు.

"అవధూత" అనేపదంలోని 'అ'-అనే అక్షరానికి ఆశా పాశమునుండి విముక్తి పొందినవాడు, ఆదిమధ్యాంతములయందు నిర్మలుడు, ఆనందాన్ని నిరంతరం పొందుతుండేవాడు'అని అర్థం. 'వ'అనేదానికి "వాసనల (పూర్వకర్మలు) నుండి విడివడినవాడు, నిరామయమైన పరబ్రహ్మగా పేర్కొనదగినవాడు, వర్తమానంలోనే (భూతభవిష్యత్తులను గురించి ఆలోచన లేక) ఉండేవాడు"అని అర్థము. "ధూ" అనేదానికి "ధూళీదూసరమైన శరీరంగలవాడు. మనస్సును స్వాధీనం చేసుకొన్నవాడు, దోషరహితుడు, ధ్యాన ధారణలు లేనివాడు" అని అర్థము ఇక"త"అనేదానికి "తత్త్వ చింత కలిగినవాడు, తమోగుణము, అహంకారము విడిచినవాడు" అనిఅర్థము. మొత్తముమీద ఆశాపాశానికి కట్టువడక, ఆత్మానందంలో మునిగితేలతూ, వాసనావర్జితమైనస్థితిని కలిగి, ధ్యానధారణ నిర్ముక్తస్థితిలో ఉండేవాడు, ధూళీదూసరగాత్రుడు, తమోహంకార రహితుడు, అవధూత" అని మనం చెప్పవచ్చు ఈ అవధూత ఆశ్రమమే దత్తుడి పంచమాశ్రమం.

## 9. దత్తుడు – జీవన్ముక్తగీత

మానవుడు జీవన్ముక్తుడు కావటానికి అవలంబించవలసిన మార్గాన్ని దత్తాత్రేయులవారు జీవన్ముక్తగీతలో ప్రవచించారు. దత్తుడియోగాన్ని అవలంబించా లనుకునేవాళ్ళు ముందు ముఖ్యంగా జీవన్ముక్తగీత, అవధూతగీత చదివి అర్థంచేసుకోవలసినఅవసరం ఎంతైనా ఉన్నది. లేకపోతే ఆత్మోపాసనకు దూరమై కేవలం సగుణోపాసనలోనే మునిగిపోయే ప్రమాద ముంది. ఇంద్రియాలనూ,

మనస్సునూ స్వాధీనం చేసుకోకపోతే యోగం సిద్ధించదు. జ్ఞానం వల్లనే యోగం చేకూరుతుంది.

"జీవుడికంటే శివుడంటూ ప్రత్యేకించి వేరొకడు లేడు. సర్వ భూతాల్లో ఉన్నది ఆ శివుడే. ఈసత్యాన్ని గ్రహించినవాడే జీవన్ముక్తు"డంటాడు దత్తాత్రేయుడు. "బ్రహ్మ ఒక్కడేకదా! అనేక జీవుల్లో, అనేక రూపాల్లో ఆయన ఎట్లా ఉంటా?డనే దానికి, "చంద్రుడు ఒక్కడేగదా! మరి-అనేక సరస్సుల్లో, చెరువుల్లో, బావుల్లో, నదుల్లో. సాగరాల్లో, జలభాండాల్లో ప్రతిబింబిస్తూ ఆయన అనేకాలుగా కనిపించటంలేదా ? ఇదీ అంతే!" నంటా డాయన. మనస్సులోని చంచలత్వాన్ని తొలగిస్తే, ఆత్మజ్ఞానం కలిగి, జీవన్ముక్తి చేకూరుతుం"దని చెబుతాడు. "జీవన్ముక్తుడికి దేనిమీద మమకారం ఉండదు. సుఖదుఃఖాది ద్వంద్వాలయెడ సమభావం కలిగిఉంటాడు. అహంకారం (నేను చేస్తున్నా ననే భావం)వదలి విధ్యుక్త కర్మలుచేసేవాడూ,కర్మే పరబ్రహ్మస్వరూప మన్న సత్యాన్ని తెలిసినవాడూ జీవన్ముక్తు"డని ఆయన అంటాడు. "విశ్వంలో సర్వత్రా వ్యాపించి ఉన్న చైతన్యమే పరబ్రహ్మ. జీవుడే దేవుడు-అనేభావంతో సర్వభూతములపట్ల మైత్రి,కరుణ కలిగినవాడూ, ఆత్మయే గురువు, అది తానే, సర్వమూ ఆ ఆత్మే, ఆఆత్మకు వికారాలుగాని, దోషాలుగాని ఉండవు. జీవుడికి హానివృద్ధు లంటూ, ఉండవు" అని తెలుసుకొన్నవాడే జీవన్ముక్తుడు. సదా" సోఽహం" (అతడే నేను) అని ధ్యానిస్తూ, సర్వత్రా వ్యాప్తమైనచైతన్యంలో లీనమైనవాడే జీవన్ముక్తుడు "నేను-నీవు-నాది, నీది"అనే భావమే సంసారకారణం. ఈమనోవ్యాపారం వల్లనే లోకవ్యవహారం జరుగు

తున్నది. "మనస్సు వాసనారహితమై, నిశ్చలస్థితిని పొందటమే మోక్షం" అనే విషయాన్ని గ్రహించినవాడే జీవన్ముక్తుడు దత్తాత్రేయులవారు మహాసిద్ధులు కాబట్టి, జీవన్ముక్తస్థితిని చేరుకోవటానికి అవలంబించవలసిన ఉపాయాలను ఇట్లా సిద్ధాంతం చేశారు ఇది "సిద్ధసిద్ధాంత"మనే పేరుతో ప్రసిద్ధికెక్కింది. దత్తాత్రేయులవారి ప్రబోధం హృదయస్థం చేసుకొని, అనుభవంలోకి ఆ విషయాలు తెచ్చుకొన్నప్పుడు జీవన్ముక్తస్థితికి మనం చేరుకోవటం తథ్యం.

## 10. దత్తసంప్రదాయం – ఆత్మధ్యానం

మనం భగవంతుణ్ణి పూజిస్తుంటాం. స్తోత్రాలు చేస్తుంటాం. జపతపాలు కొనసాగిస్తుంటాం. కాని ధ్యానంజోలికి మాత్రం పోము. అసలు ధ్యానమంటే ఏమిటో చాలామందికి తెలీక అదికూడా మంత్ర జపమేనని అనుకోవటంకూడా ఉంది. మంత్రజపం వేరు. ధ్యానం వేరు. ధ్యానమంటే ఆలోచన. ఆలోచనకూడా కాదు–దానిని అధిగమించిన – మనస్సును స్థిరపరచుకొన్న – ఒకానొక నిశ్చలనిర్మల ప్రశాంత ఆనందమయ మనస్థితి అది !

ఉత్తమో బ్రహ్మసద్భావో ధ్యానభావస్తు మధ్యమః
స్తుతిర్జపోఽధమోభావో బహిఃపూజా అధమాధమః"

"ఎల్లప్పుడూ బ్రహ్మభావనలో ఉండటం ఉత్తమం ధ్యానం చేయటం మధ్యమం. స్తోత్రజపాదులు అధమం. ఇక విగ్రహ పూజలూ, తీర్థయాత్రలూ మొదలైనవి అధమాధమం." అని మహానిర్వాణతంత్రం చెబుతుంది. బ్రహ్మభావనలో ఉండటమంటే "తాను దేహంకాక ఆత్మయేననీ, ఆఆత్మే సర్వభూతాల్లోనూ ఉన్న

దనీ, తనకంటే వేరైనది ఈ జగత్తులో ఏమీ లేదని గ్రహించి తనను అన్నిజీవుల్లోనూ, అన్ని జీవులనూ తనలోనూ దర్శించే మన స్థితిలో ఉండటం. అంటే "అహం బ్రహ్మాస్మి", "తత్త్వమసి" మొదలైన మహావాక్యాలకు ఉదాహరణప్రాయంగా ఉండటం ఇట్లా బ్రహ్మభావనలో ఉండట మనేది ఉత్తమోత్తమమైన స్థితి, ఇది కోటి ధ్యానాలతో సమానం.కోటిపూజలు ఒకస్తోత్రానికీ, కోటిస్తోత్రాలు ఒకజపానికీ, కోటిజపాలు ఒకధ్యానానికి సమానం. అంటే మనం చేసే పూజలూ,జపతపాలు వ్యర్థమైన వని కాదు. అవి వరుసగా అంతరంగ సాధనగా పరిణమించాలని భావం. ముఖ్యంగా దత్త సంప్రదాయంలోని వాళ్ళు సగుణారాధన (బాహ్యపూజ)చేస్తున్నా, దాన్ని నిర్గుణోపాసనగా (అంతరంగ సాధనగా) మార్చుకొనేటట్లు మానసికపరిణతి సాధించాలి. క్రమంగా ధ్యానాన్ని అభ్యాసం చేసి, ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలి. దత్తుడి యోగానికి ఆత్మసాక్షాత్కారమే గమ్యం.

ఒక ప్రశాంతమైనచోట (ఏకాంత ప్రదేశంలో) ఎట్లా కూచుంటే సుఖంగా ఉంటుందో అట్లా అసనం వేసుకొని (పద్మాసనం శ్రేష్టం) వెన్ను వంచకుండా నిటారుగా కూచోని, శిరస్సు కొంచెంపైకెత్తి, నోరుమూసుకొని (దంతములు ఒకదానితో నొకటి తగులరాదు) దృష్టిని భ్రూమధ్యమునందే నిలిపి ఉంచాలి. తర్వాత ప్రాణాయామం చెయ్యాలి. ఎడమముక్కుతో 16 మాత్రల (క్షణాల)కాలం వాయుపును పూరించి, 64 మాత్రలకాలం కుంభించి (పూరించేకాలానికి కుంభించేకాలం 4రెట్లు ఉండాలి) 32 మాత్రల

కాలం(పూరణకు రెట్టింపు) కుడిముక్కుద్వారామెల్లగాగాలి వదలాలి. కుడిముక్కుతో గాలిని పీల్చి, ఎడమముక్కుతోనైనా వదలవచ్చు గాలిని పూరించి లోపల కుంభించేమాదిరిగానే వాయువును వదలి, వెలుపలనే కుంభించేపద్ధతికూడా ఉన్నది. ముందుగా కుడిముక్కుతో గాలిని పీలిస్తే, రెండోసారి గాలిని వదలిన ఎడమముక్కుతోనే గాలిని పూరించాలి. ఎడమముక్కుతో ముందుగా పూరిస్తే రెండోసారి కుడిముక్కుతో పూరించాలి. ఈ ప్రాణాయామాన్ని ఓంకారంతోగాని, లేకుండాగాని చెయ్యవచ్చు. దీనివల్ల ప్రాణం స్థిరపడి, మనస్సు నిశ్చలమౌతుంది. నరాలు ఉత్తేజం పొంది మానసికోల్లాసం కలిగి, రక్తం శుభ్రపడటంచేత శరీరానికి, జవసత్త్వాలు కలుగుతవి. మనస్సు, ప్రశాంత మౌతుంది. శ్రీ బ్రహ్మానందసరస్వతీస్వామివారిఅభిప్రాయాన్ని అనుసరించి మాత్ర అంటే ఒకసెకండు. ప్రాణాయామం ప్రతిరోజు ఉదయం, సాయంత్రం కనీసం 10సార్లు చెయ్యాలి. ఇది లఘుప్రాణాయామం. ప్రాణాయామం చెయ్యాలనుకున్నప్పుడు మొట్టమొదట 16మాత్రలకాలం చేయలేకపోతే కాలపరిమితి తగ్గించుకోవచ్చు. అయితే పూరకానికి రెట్టింపు రేచకం, నాలుగురెట్లు కుంభకం ఉండాలి.

ప్రాణాయామం చేసినతర్వాత మొదటచెప్పినట్లు నిశ్చలంగా కూచోని, మనస్సులో పుట్టే ఆలోచనలను జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి. మన మనస్సులో ఒకఆలోచన తరువాత మరొకటి–దాని తర్వాత ఇంకొకటి, ఇట్లా తరంగాలలాగా ఆలోచనలు పుట్టుకొని వస్తుంటవి. ఒక తరంగానికీ మరొక తరంగానికీ మధ్యనున్న నిశ్చలస్థితిని అందుకోవటానికే ధ్యానం చేయాలి. ధ్యానంయొక్క

లక్ష్యం ఏకాగ్రతను (మనోనిశ్చలతను) సాధించటమే. శంకర భగవత్పాదులు ధ్యాన మంటే 'ఆత్మస్వరూప చింతన'మని సెల విచ్చారు. ఏకాంత ప్రదేశంలో కూచోని, కళ్ళు మూసుకొని, పుట్టుకొనివస్తున్న ఆలోచనలను త్రుంచివేస్తూ, జ్ఞప్తికి వస్తున్న విషయాలను అణచివేస్తూ—భ్రూమధ్యంలో దృష్టి నిలిపేందుకు ప్రయత్నిస్తూ సాధన కొనసాగిస్తుంటే—కొంతకాలానికి బుద్ధి ఏకాగ్రం కాక తప్పదు మనోనిశ్చలత కలగక తప్పదు.

ఆత్మచింతన చేస్తూ, ''నే నెవరు' ? అని ఆలోచిస్తూ (ధ్యానిస్తూ) ఉంటే, అలర్కుడిమాదిరిగా "నేను మనస్సును కాను. బుద్ధిని కాను. అహంకారాన్ని కాను. శరీరాన్ని కాను. వీటికంటే విలక్షణమైనవాణ్ణి. నాకు అతిసమీపంలో ఉన్న ఈ దేహాన్నే నేను కానప్పుడు మరి నేనెవర్ని ? నేను ఆత్మను (చైతన్యాన్ని) అన్ని జీవులలో ఉన్న ఆత్మను నేనే. అన్ని జీవులు నేనే. నేను కానిది ఈ లోకంలో లేదు. నేనే పరమాత్మను"అనే ఎరుక క్రమంగా కలుగుతుంది. ఇట్లా కలగటానికి కొన్ని రోజులు పట్టవచ్చు. కొన్ని సంవత్సరాలు పట్టవచ్చు. కొన్ని జన్మలు పట్టవచ్చు. అవి వారివారి సాధనతీవ్రతపై ఆధారపడి ఉంటుంది. ''నేను ఆత్మను" అని తెలుసుకొని, ఆ ఆత్మకూ పరమాత్మకూ భేదం లేదన్న సత్యస్థితిని అందుకోవటమే—"దత్తోఽహమని భావించటమే – దత్తుడు చెప్పిన యోగమార్గం. (ఆత్మవిషయే ఏకాగ్రీకరణం"అని యోగానికి భగవత్పాదులు భాష్యం చెప్పారు.) అదే జీవన్ముక్తస్థితి. దీన్ని సాధించటమే దత్తసాధకుల ధ్యేయం.

## 11. దత్తాత్రేయుడు - షోడశసంఖ్య

దత్తాత్రేయులవారిది షోడశకళాపూర్ణమైన పరబ్రహ్మావతార మనే విషయాన్ని ఆ అవతారంతో ముడివడిన షోడశసంఖ్య (16) ధ్రువపరుస్తున్నది. పరిపూర్ణ విష్ణ్వవతారాలుగా పరిగణించబడు తున్న రామకృష్ణావతారాలనుగురించి లోకంలో కొన్ని భిన్నాభిప్రా యా లున్నవి. "ఆత్మానాం మానుషం మన్యే రామం ధశరధాత్మజం" అని పలికిన రాముడిఅవతారం 14కళలతో కూడింది. అదిసంపూర్ణా వతారం కాదని కొన్నిపురాణాలు వెల్లడించాయి. "అవజానాంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితం"అని కంఠోక్తిగా చెప్పిన శ్రీకృష్ణపరమాత్మనే మత్స్యపురాణం "మత్స్య కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః రామో రామశ్చ రామశ్చ"అని పరశ రాముణ్ణీ, దశరథరాముణ్ణీ, బలరాముణ్ణీ దశావతారాల్లో చేర్చింది కాని శ్రీకృష్ణుణ్ణి చేర్చలేదు. అంతమాత్రంచేత రామావతారానికీ, కృష్ణావతారానికీ మనం విలువఇవ్వక త్రోసిపుచ్చలేదుకదా! దశావ తారాల్లో దత్తావతారం లేదనీ అది సంపూర్ణావతారం కాదు కేవలం అంశావతారమనీ, రామకృష్ణాదులతో దత్తాత్రేయుడు సరిపోలడనీ- ఇంకాఏమేమో తెలియనివాళ్ళుఅనుకుంటూ ఉంటారు వాల్మీకి రచిం చిన రామాయణం, ఇతరకవుల రామనాటకాలు, కావ్యాలు మొదలై నవాటివల్ల రాముడు మనకు బాగా దగ్గరివాడైనాడు. ఇందుకు తులసీ దాసు, రామదాసు మొదలైన భక్తులుగూడా ఎంతగానోతోడ్పడ్డారు. రాముడికథ ప్రతివానికీ అత్యంతాకర్షకమై, రాముఁడనంగానే"దశరథ రాము"డన్న అభిప్రాయానికి జనంవచ్చారు (ఆరాముడికంటేముందు పరశురాముడూ, ఆయనకంటే ముందు ఆత్మారాముడూ ఉన్నారన్న

విషయం తెలిసినా)-అట్లాగే కృష్ణుడి చరిత్ర భారతభాగవతాల్లో, హరివంశంలో ఇట్లా అనేకపురాణాల్లో కావ్యాల్లో, నాటకాల్లో వర్ణించ బడింది. రామకృష్ణావతారచరిత్రగాథలు రసరంజితాలు-రామకృష్ణుల కు కావ్యనాయకులుగా ఉండటానికి కావలసినలక్షణాలన్నీ ఉన్నాయి. దత్తుడు అట్లాకాదు. ఆయన్నుగురించి చాలాపురాణాలు (ముఖ్యంగా బ్రహ్మాండపురాణం, మార్కండేయపురాణం, బ్రహ్మవైవర్తము, భాగ వతము మొదలయినవి) చెప్పినా—అదంతా ఆయన జ్ఞానబోధలు గురించే. రామకృష్ణులు కేవలం విష్ణువుయొక్కఅవతారాలైతే దత్తా త్రేయుడు సాక్షాత్తు పరబ్రహ్మ. దత్తుడిలో త్రిమూర్తులఅంశ లున్నవి. ఈ అవతారం అన్నిఅవతారాల్లాగా నిర్దిష్టకార్యం పూర్తి కాగానే (దుష్టశిక్షణ కాగానే) ఈ లోకంనుంచి నిష్క్రమించిన అవతారంకాదు. నిత్యసత్యావతారం. ఈ నాటికీ, మరేనాటికీ ఈ భూమిమీద జనావళి ఉన్నంతకాలం, వాళ్ళకు జ్ఞానబోధ చేయటం కోసం, ధర్మవ్యవస్థను చక్కదిద్దటంకోసం ఆ అవతారంయొక్క అవ శ్యకత ఉండకతప్పదు. ఆ అవతారానికి ఇంతటి విశేషం ఉన్నప్ప టికీ రామకృష్ణావతారాలలాగా అంతప్రాచుర్యం రాకపోవటానికి ఆయన అవలంబించిన యోగమార్గం ఒకకారణం కావచ్చు. శ్రీకృష్ణుడు తన వార్ధక్యంలో ఏఅర్జునుడికో, ఏఉద్ధవుడికో యోగం బోధించాడు. ఆ యోగీశ్వరేశ్వరుడియోగం ఒకమూల పడిపోయింది. భక్తి విశ్వ రూపంధరించింది. ఈనాడు కృష్ణభక్తికి ఉన్నంత ప్రాచుర్యం కృష్ణ యోగానికి లేదు. లోకులు భక్తిని పట్టుకున్నంతగా యోగాన్ని పట్టుకోలేరు. దత్తుడి యోగమార్గం కూడా భక్తిమార్గంగా మలుపు తిరిగింది. మహానుభావ, సమర్థ, సిద్ధ, ఆనందాదిసంప్రదాయులుగా

అనేకశాఖలుగా చీలింది. అనేక మంత్రతంత్ర పద్ధతులు వెలిశాయి. దత్తుడి యోగపద్ధతికంటే దత్తమంత్రవిద్యకు ఆనాడు లోకంలో చెలామణి ఎక్కువగా ఉంది. యోగనాథుడైన దత్తుణ్ణి ఈ నాడు భక్తిమార్గంగా ఉపాసించటం జరుగుతున్నది. అయినప్పటికీ దత్తుడు లోకానికి అంతగా తెలియకపోవటానికి, ఆయనచరిత్రను కావ్యస్థం చేసే వాల్మీకివ్యాసులు పుట్టంపోవటం – ఒకకారణం కావచ్చు. ఇంకా ఇంకా కారణాలను అన్వేషింపవలసిఉంది.

శ్రీకృష్ణావతారాన్ని దశావతారాల్లో చేర్చని మత్స్య పురాణం దత్తుడికి విశేష గౌరవంఇచ్చింది. మత్స్య పురాణంలో నందీశ్వరుడు నారదుడికి విభూతి ద్వాదశీ వ్రతాన్ని గూర్చి చెబుతూ "విష్ణువు యొక్క అవతారాలైన మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, భార్గవరామ, శ్రీరామ, బలరామ, బుద్ధ, కల్కి, దత్తాత్రేయ వ్యాసులను 12 మందిని మాసానికి ఒకరిని చొప్పున క్రమంగా 12 మాసాల్లోనూ పూజించాలి" అని చెప్పాడు. దత్తుడు బ్రహ్మ విద్యకూ, శ్రీవిద్యకూ, యోగవిద్యకూ, ఆద్యుడైన గురుస్వరూపంగా, ఆదిగురువుగా. పరబ్రహ్మ స్వరూపంగా పురాణాలు పేర్కొన్నాయి.

దత్తాత్రేయుడికి మార్కండేయుడిలాగా ఎప్పుడు చూచినా వయస్సు పదహారు సంవత్సరాలే. ఆయన అవతారాలు పదహారు ప్రసిద్ధి కెక్కిన ఆయననామాలు పదహారు. ఆయన మంత్రాలలో షోడశాక్షరి చాలా ప్రధానమైనది. ఇది ఎంతశక్తివంతమైన మంత్ర మంటే– అమంత్రాన్ని గురించి శ్రీమన్నారాయణుడు బ్రహ్మకు

చెబుతూ "ఎవరికన్నా కళ్ళు నివ్వవచ్చు, చెవి నివ్వవచ్చు ప్రాణం ఇవ్వవచ్చు, పదహారుసార్లు తలనైనా కోసి ఇవ్వవచ్చు, కానీ ఈ మంత్రాన్ని ఎవరికీ ఇవ్వరాదు. అతి సేవా పరాయణుడైన యోగ్యుడైన సాత్వికుడైన శిష్యుడికి మాత్రమే -వానిని పరీక్షించి తృప్తిపడిన తరువాతే ఆమంత్రం ఇవ్వాలి" అని చెప్పాడు. సంఖ్యా శాస్త్ర పరంగాచూస్తే ఈ పదహారు అనే సంఖ్యకు ఒక విశేషం కనబడుతున్నది. 16 లోని ఒకటి ఆరు కలిపితే ఏడవుతుంది. ఈ సప్త సంఖ్య అనంతత్వానికీ సంపూర్ణతకూ సంకేతం. ఈ సంఖ్యను శ్రుతులు అవ్యక్తంగా అనంతత్వంగా సూచించాయి. మొదట ఏకమైన తత్త్వం ఆతర్వాత అనేకధా చీలి సృష్టిగామారింది "తంధీరా వాచా ప్రణవంతి సప్తా" అని మన ఋషులు మూల తత్వాన్ని సప్తసంఖ్య (ఏడు)గా పేర్కొన్నారు. మూలతత్వమైన పరబ్రహ్మయే దత్తాత్రేయులవారు. శ్రీవిద్యలో నవారణకు ప్రాధాన్యమున్నట్లే, దత్తసంప్రదాయంలో సప్తావరణకు పూజావిధిలో ప్రధాన్య ముంది.

## 12. దత్తాత్రేయ షోడశనామస్తోత్రము

వరదః కార్తవీర్యాదిరాజరాజ్యప్రదోఽనఘః
విశ్వశ్లాఘ్యోఽమితాచారో(రీ)దత్తాత్రేయో మునీశ్వరః
పరాశక్తిపదాశ్లిష్టో యోగానందః సదోన్మదః
నమస్తవైరితేజోహృత్ పరమామృతసాగరః
అనసూయాగర్భరత్నో భోగమోక్షసుఖప్రదః
శ్రీపాదవల్లభః పాతు శ్రీనరసింహసరస్వతీ

1) ఓం ద్రాం వరదాయనమః 2) ఓంద్రాంకార్తవీర్యాదిరాజ రాజ్యప్రదాయ నమః 3) ఓంద్రాంఅనఘాయనమః 4) ఓంద్రాం విశ్వశ్లాఘ్యాయ నమః 5) ఓంద్రాంమితాచారాయనమః 6) ఓంద్రాం దత్తాత్రేయాయ నమః 7) ఓంద్రాంమునీశ్వరాయ నమః 8) ఓం ద్రాంపరాశక్తి పదాశ్లిష్టాయ నమః 9) ఓంద్రాంయోగానందాయ నమః 10) ఓంద్రాంసదోన్మదాయనమః 11) ఓంద్రాం సమస్తవైరితేజో హృతేనమః 12) ఓంద్రాంపరమామృతసాగరాయ నమః 13) ఓం ద్రాం అనసూయాగర్భరత్నాయనమః 14) ఓంద్రాంభోగమోక్షసుఖ ప్రదాయనమః 15) ఓంద్రాంశ్రీపాదశ్రీవల్లభాయనమః 16) ఓం ద్రాంశ్రీనృసింహసరస్వతీస్వామి సద్గురుపాదుకాభ్యాం నమః

అష్టోత్తరశతనామపూజకూడా చేసుకోవడానికి సమయం చాల నప్పుడు ఈ షోడశనామాలతో దత్తాత్రేయుణ్ణి అర్చించి మనం లఘు పూజ చేసుకోవచ్చు.

## 13. షోడశావతారాలు - కాలనిర్ణయం

శ్రీవాసుదేవానందసరస్వతీస్వామివారు వెల్లడించిన శ్రీదత్తాత్రేయ షోడశావతారాలు చాలావరకు దత్తతత్త్వాన్ని విస్పష్టంగా వెల్లడిస్తు న్నవి. ఆ అవతారా లెప్పుడు? ఏ ప్రయోజనంకోసం ఏర్పడ్డవో? మన మిప్పుడు తెలుసుకొందాం.

1) యోగిరాజు-కార్తిక శుద్ధపౌర్ణమినాడు దత్తాత్రేయు డీ అవ తారాన్ని ధరించాడు. దత్తాత్రేయుడు సర్వదేవమయు డనే విషయాన్ని ఈ అవతారం వెల్లడిస్తున్నది. 2) అత్రివరదుడు- కార్తిక బహుళ పాడ్యమినాడు ఈఅవతారం ఏర్పడింది. దత్తా

త్రేయుడు సర్వమంత్రార్థగమ్యస్వరూపు డన్న విషయం ఈఅవతారం మనకు స్పష్టంచేస్తుంది. 3. దత్త ప్రభుపు– ఈ అవతారం కార్తీక బహుళ విదియనాడు ఏర్పడింది. అత్రితపస్సుకు మెచ్చి యోగి రాజుగా అవతరించిన పరబ్రహ్మ తనంతట తానే ఆయనకు దత్తం కావటం ఇది వెల్లడిస్తుంది. 4. కాలగ్ని శమన– మార్గశిరశుద్ధ చతుర్దశి(పౌర్ణమి)నాడు ఈఅవతారం ఏర్పడింది యోగిరాజు అత్రికి ఔరసుడు కావటం ఇది వెల్లడిస్తుంది 5. యోగిజన వల్లభ– మార్గశిర పౌర్ణమి. ఈ అవతారం దత్తుడు భక్త వరదుడనే విషయం వెల్లడిస్తుంది. 6 లీలా విశ్వంభర–పౌష్య పౌర్ణమి. ఈఅవతారం ఆయన భక్తజన సంరక్షణార్థం బాలుడై వాళ్ళమధ్య ఎట్లా క్రీడించిందీ మనకు వివరిస్తుంది. 7. సిద్ధరాజు– మాఘపౌర్ణమి. పూర్వమున్న యోగాన్ని హరించి, తనదైన ఒక కొత్తయోగపద్ధతిని ఆయన ప్రవేశ పెట్టిన విధానాన్ని ఇది తెలుపుతుంది. 8 జ్ఞాన సాగర–ఫాల్గుణశుద్ధ దశమి. తానుప్రసాదించిన యోగవిద్యను జ్ఞానసాధనకు వీలుగా మార్చటం కోసం (జ్ఞానసాగరరూపేణ తం యోగం జ్ఞానసాధనం కృత్వా-అని మూలము) ఇది ఏర్పడింది. 9, విశ్వంభరావధూత-చైత్ర పౌర్ణమి. భక్తియోగం సంస్థాపించ డం కోసం ఈ అవతారం ఏర్పడింది. 10. మాయాముక్తావధూత వైశాఖశుద్ధ చతుర్దశి. భక్తుల హృదయాలను శోధించటం కోసం ఈ అవతారంఏర్పడింది 11)[1]మాయాయుక్తావధూత – జ్యేష్ట శుద్ధత్ర యోదశి. భక్తులకు మోహం కలిగించటం కోసం (భక్తానాంమోహ కం ఫలం దత్వా-అనిమూలం) ఈ అవతారం ఏర్పడింది. 12. ఆది

1. కొన్ని గ్రంథాలలో ఇది "మాయాముక్తావధూత" అని పొరబాటుగా ముద్రించబడింది.

గురువు-అషాఢపౌర్ణమి. ఉత్తమాధికారులకు జ్ఞానప్రదానం చెయ్యటం కోసం ఇది ఏర్పడింది. 13. శ్రీ శివరూప-శ్రావణపౌర్ణమి. మధ్యమాధికారులైనభక్తులకు సగుణసాయుజ్యాన్ని ఇవ్వటంకోసం (మధ్యమానాం శివరూపేణ సగుణసాయుజ్యం దత్వా)ఇది ఏర్పడింది 14. శ్రీదేవదేవ-భాద్రపదశుద్ధ చతుర్దశి· దేవగంధర్వ మనుష్యాదులకు ఆత్మపదం ప్రసాదించటంకోసం (దేవదేవస్యరూపేణ మోహితపూర్వాణాం దేవగంధర్వమనుష్యస్వరూపాణాం ఆత్మభక్తానాం ఆత్మపదం దత్వా) ఈ అవతారం ఏర్పడింది. 15. శ్రీ దిగంబర-ఆశ్వీజపౌర్ణమి. యోగభక్తిజ్ఞాన వైరాగ్యసాధనామార్గాన్ని సంస్థాపన చెయ్యటంకోసం ఇది ఏర్పడింది. 17. శ్రీకృష్ణ శ్యామ కమలనయన-కార్తీకశుద్ధద్వాదశి నానారూపాలు ధరించి, యోగనిద్ర చెందిన శ్రీకృష్ణరూపుడైనదత్తుడుతానుసర్వదేవమయుణ్ణని తెలియజేయటం కోసం ఈ అవతారం ఏర్పడింది.

ఈ పదహారు అవతారాలేగాక లోగడ మనం చెప్పుకున్నట్లు దత్తాత్రేయులవారు కృతయుగంలో వైశాఖబహుళ దశమి గురువారం నాడు అవతరించినట్లుగా ఉంది. అది ఖగోళానికి సంబంధించిన పరిణామ విశేషం. షోడశావతార కథనాన్ని బట్టి విచారించి చూస్తే, ఖగోళంలో కృతయుగంలో ఏర్పడిన త్రిమూర్త్యాత్మకమైన దత్తశక్తి ఓం ప్రథమం యోగశక్తిగా భూమిపై అవతరించింది కార్తీక పౌర్ణమి కావటం మనం గమనించవలసిన విషయం. కుండలినీ శక్తికి సంకేతంగా పేర్కొనబడిన కార్తికేయుడి (కుమారస్వామి లేదా సుబ్రహ్మణ్య స్వామి) శక్తి సంపూర్ణంగా భూమి మీద ప్రసారమౌతున్న పర్వదినంకార్తీక పౌర్ణిమ· ఆరోజు మనం మన ఆత్మ

జ్యోతులను ప్రజ్వలింప జేసుకోవాలనటానికి సంకేతంగా దేవాలయా ల్లో - ఇళ్ళముందు దీపతోరణాలు, కార్తీకదీపాలు వెలిగిస్తుంటాం. గురుదేవ స్వరూపాలు రెండూ కలిగి, షడ్భుజాలతో, మూడు శిరస్సు లతో "అత్రి వరదుడు" గా దత్తుడు అవతరించటం ఆయన త్రిమూ ర్త్యాత్మకమైన పరబ్రహ్మ స్వరూపం (త్రిగుణాత్మకమైన యోగస్వరూ పం)అని తెలియజెప్పడానికే-"నేను పరబ్రహ్మను గూర్చి ధ్యాని స్తుంటే ముగ్గురు మూర్తులు మీరు కనిపించారేమిటి?" అని అడిగిన అత్రి అజ్ఞానాన్ని తొలగించి, భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శింపజేసి న జ్ఞానస్వరూపం అది కావటం మరొక విశేషం. అత్రికి (సాధకుడికి) విశ్వశక్తి సొంతమైంది మార్గశిరపౌర్ణమి(చతుర్దశి) కావటం చేత సాధకులందరికీ ఆరోజు విజయసూచకమైన పర్వదినమైంది. ఈ 16 అవతారాలూ కార్తీకం నుండి తిరిగి కార్తీకం వరకూ - అంటే ఒక సంవత్సర కాలంగా ఏర్పడిన విధం గమనిస్తే, కాలచక్రంలో (రాశిచక్రంలో) జరిగిన దత్తశక్తి యొక్క పరిణామక్రమాన్ని అది వెల్లడిస్తున్నట్లు తోస్తుంది. ఈ అవతారాలేర్పడిన ఆయా నెలల లో, ఆయారోజులలో - ఆశక్తి భూలోకవాసులకు అతి చేరువలో ఉండటం చేక, ఉపాసన ద్వారా ఆశక్తిని సాధకులు సునాయాసం గా దత్తత చేసుకోగలుతారు. షోడశావతార పర్వదినాల్లో చేయవ లసిన పూజావిధానం (దత్తజయంతి ఒకటి కాదు. ఇట్లా పదహారు ఉన్నాయి) దత్తాత్రేయ షోడశావతారాల చివర పొందుపరచబడింది. అక్కడ దాన్ని చూడవచ్చు. దత్త ప్రభువు ఆయాకాలాలలో ప్రసా దించిన సగుణసాక్షాత్కారాలనే మన మహర్షులు ఆయన యొక్క షోడశావతారాలుగా గుర్తించి ఉంటారని మనం భావించవచ్చు.

## 14. ఖగోళశాస్త్రం - దత్తాత్రేయుడు

"సప్తదిశోనానాసూర్యం"అని బ్రహ్మాండపరిమాణంగల సూర్యగోళాలనుగురించీ, అవి నక్షత్రరూపాలు కావటంగురించీ, మనవేదఋషులు ఎన్నో పరిశోధనలు చేసి, వివరాలు గ్రహించారు. ఏఋతువులో ఏనక్షత్రం ఉదయించే సమయానికి భూమిమీద ఎటువంటి పరిస్థితు లేర్పడతాయో, ఆ వివరాలుకూడా గ్రహించి, ఆయా దేవతలతో అవినాభావసంబంధాన్ని కలిగియుండటాన్ని తెలుసుకొన్నారు. "తైత్తరీయసంహిత"లో ఉన్న "నక్షత్రఇష్టి"నుండి మంత్రాలను గ్రహించి ఏనక్షత్రానికి ఎవ్వ రధిదేవతో నిశ్చయం చేసుకొన్నారు. కృత్తికా నక్షత్రం అగ్నిదేవతగా, స్వాతీనక్షత్రం వాయుదేవతగా ఇత్యాదిగా ఋషులు చెప్పటం జరిగింది. ఒక్కొక్క నక్షత్రంలో ఒక్కొక్కదేవతకు ఇట్లా సంబంధం ఏర్పడటమేగాక అద్వైతభావం రూఢమైంది. "అహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపం" అని శృతి చెబుతున్నది. సూర్యోదయానికిముందు నక్షత్రాలు తూర్పున మొట్టమొదట పొడచుటనుబట్టి, సూర్యాస్తమయంకాగానే తూర్పున ఉదయించటాన్నిబట్టి, ఆనక్షత్రదేవతలకు పూజలనీ, పండుగలనీ ఏర్పడ్డాయి. ఇంతేకాదు. ఖగోళంలోని ఒక నక్షత్రంగాని, నక్షత్రసముదాయంగాని ఆక్రమించినస్థానాన్నిబట్టి దాని సమీపంలోనున్న నక్షత్రరూపవిశేషాలనుబట్టి ఆయానక్షత్రాదిదేవతల వాహనాలూ, ధ్వజాలు, రూపవిశేషాలూ, వారు సాధించిన మహాకార్యాలూ, కథలుగా పురాణాల్లో చెప్పబడ్డాయి. ఈవివరాలు తెలుసుకోవాలనుకొనేవాళ్ళు శ్రీగొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారు రచించిన "జ్యోతిర్వేదం" చూడవచ్చు.

"విష్ణుపదం" అనేది ఖగోళంలో ఆకాశాన ఉత్తరవైపుగా ఉంది. "ఊర్ధ్వోత్తరాం ఋషిభ్యస్తు ధ్రువో యత్రాస్తివై స్మృతమ్, ఏతత్ విష్ణుపదం దివ్యం" ధ్రువమండలమునకుపైగా, సప్తఋషి మండలానికి ఉత్తరంగా, ఎగువగా "విష్ణుపదం"ఉన్నదని (విష్ణు పురాణం II–99) తెలుస్తున్నది. ధ్రువుడు, సప్తఋషులు, అగస్త్యుడు మున్నగునవి నక్షత్రరూపంగా ఉన్నట్లు విష్ణువుకూడా నక్షత్రస్వరూపంగా ఉన్నాడు ఒక సూర్యునిద్వారా మనకు ఎంతగానో జీవశక్తి (ఒకక్షణానికి 640 టన్నులఉదజని హీలియంగా మారి భూమిపైకి శక్తిరూపంగా ప్రసారమౌతున్నదని శాస్త్రజ్ఞుల అంచనా) ప్రసారమౌతుంటే కొన్నిలక్షలనక్షత్రాల సముదాయంతో ఏర్పడే తేజోవంతమైన విశ్వభాగాలనుండి సూర్యుడికంటే ఎంతో పెద్దవైన నక్షత్రాలనుండి వెలువడుతున్న ఆ శక్తి ఎంతమహత్తరమైనదో మనం ఊహించలేము. ఈ శక్తిప్రసారాన్ని గమనించి మనపూర్వమహర్షులు, మనకు కనబడే నక్షత్రాల సముదాయంలో ఏఏ స్థానాలనుంచి ఎట్లాంటిశక్తి భూలోకవాసులకు అందుతున్నదో వాటికి ప్రత్యేకంగా పేర్లుపెట్టి మనకు అందించారు. మన పూర్వీకు లందించిన ఈజ్ఞానసంపదవల్లనే ఈనాడు మనం ఆరాధిస్తున్న దేవతామూర్తులకు రూపకల్పన జరిగింది. ఇప్పుడు భూమిపై రుద్రుని ఆరాధించేవాళ్లు ఖగోళంలోని రుద్రస్థానం నుండి విష్ణువును ఆరాధించేవాళ్లు విష్ణుస్థానం నుంచి,.... ఇట్లా ఆయాదేవశక్తుల స్థానాన్నుంచి ఆయాశక్తులు పొందుతున్నారు.

సూర్యపథాన్ని అనుసరించి మనకు కనిపించేనక్షత్రభాగాన్ని "రాశిచక్రం" అంటారు. ఈరాశిచక్రాన్ని ధ్రువనక్షత్రంతో

కలిపితే శంఖంలాంటి ఆకారం ఏర్పడుతుంది. ఆఆకారాన్నే విష్ణువు గా (విష్ణుపథంగా) పేర్కొనటం జరిగింది రాశి చక్రంపైనా, క్రిందా ఉన్న అర్ధగోళాకృతులనుగూడా ఎన్నో భాగాలుగా విభజించి అక్కడినుంచి గూడా–ప్రత్యేక నక్షత్రాలద్వారా–విశ్వకేంద్రంలోని శక్తి భూలోకవాసులకు అందుతున్న దని తెలిసిన మహర్షులు "సప్త ఋషిమండల"మనీ, "హంసారూఢుడైన బ్రహ్మస్థాన"మనీ, "మృగ వ్యాధరుద్రునిస్థాన"మనీ ఇట్లా ఎన్నోనక్షత్రమండలభాగాలను గుర్తించి పేర్లు పెట్టారు, అత్యంత తేజోవంతమైన నక్షత్రాలు దట్టంగాఏర్పడిన తెల్లటిభాగానికి "క్షీరసాగరం"(పాలపుంత) అని పేరుపెట్టారు. అందులో కొంతభాగాన్ని "దివిజగంగ" అన్నారు. ఈపాలపుంతపైగల ఒకానొక నక్షత్రభాగాన్ని "వైకుంఠదామం"గా గుర్తించారు. మిధునరాశిసమీపంలోని రుద్రక్షేత్రం "మృగవ్యా ధుడు"గా (ఓరియన్‌గా) పేరుపెట్టారు. ఇక్కడున్న నక్షత్రసము దాయం ఒకవేటగాని ఆకారంగా ఉండటం చేత ఆపేరుపెట్టారు. ఈనక్షత్రసముదాయంలో ఆర్ద్రానక్షత్ర ముంది. ట్రెపీజియం ఆకారంగా ఉన్న మూడు చిన్ననక్షత్రాలు "మృగశిర". ఆర్ద్రానక్ష త్రానికి రుద్రుడూ, మృగశిరకు చంద్రుడూ అధిష్టాన దేవతలు. "ఛారిటీర్"అనేనక్షత్రమండలం ఖగోళంలో ఉంది. దీన్నే "ఆరిగ" అంటారు. ఇందులో బ్రహ్మ, ప్రజాపతి అనేరెండునక్షత్రాలున్నవి. "ఓరైన్" (orion) అనేరుద్రనక్షత్రం పాలపుంతక్రిందిభాగాన– పాలపుంతదగ్గరిలో - మృగశిర, రోహిణీనక్షత్రాలుగల విష్ణుస్థానం ఉన్నది. మరొకవైపున రథాకారంలోఉన్న ప్రజాపతి, బ్రహ్మస్థానం రాశిచక్రంలో, మిధునరాశి సమీపంలో ఉన్నవి. త్రిమూర్తులకు

నెలవైన ఈ మూడుప్రదేశాలు రాశిచక్రంలో అతిదగ్గరగా ఉండి, దత్తాత్రేయులవారి త్రిగుణాత్మకమైనస్వరూపంగా ఏర్పడుతున్నది. దీనికి దగ్గరగానే శేషశాయిగాఉన్న విష్ణుస్వరూపం ఉంది. ఈ విశ్వ కేంద్రం, విష్ణుస్థానం, త్రిమూర్తుల కలయికగా ఉన్న దత్తుడిస్థానం ఒకసరళరేఖపై ఏర్పడిఉన్నాయి. దత్తుడు జన్మించిన మార్గశిర మాసంలో పూర్ణిమనాడు మనం ఉన్న భూమి దత్తుడిస్థానానికి అతి సమీపంగా మిథునరాశిలోనూ, ఆత్మకారకుడైన రవి ఎదురుగా దనుస్సురాశిలోనూ ఉండటం జరుగుతుంది. రవి ధనస్సులోనూ (ధనుర్మాసం) చంద్రుడు పూర్ణిమనాటికి మృగశిరానక్షత్రంలోనూ (మిథునరాశి) ఉండడంవల్ల, ఆయన జన్మించిన సమయానికి భూవాసులమైన మనంకూడా అదే సరళరేఖలోకి వచ్చి నిలుస్తున్నాం. కనుక దత్తజయంతినాటికి మనప్రమేయం లేకుండానే విశ్వకేంద్రం నుండి, విష్ణుస్థానం నుండి (ధనుస్సుసమీపంలో) శక్తిని గ్రహించే స్థితికి మనం వస్తున్నామనీ, ఆసమయంలో త్రిమూర్త్యాత్మకుడూ, యోగమూర్తి (త్రిగుణాత్మకుడు) అయిన దత్తునిస్థానంకూడా మనకు అతి సమీపంలో ఉంటుందనీ అర్థమౌతుంది.

## 15. దత్తాత్రేయుడు – శ్రీకృష్ణుడు

దత్తాత్రేయ అనుష్టుప్ మంత్రము "దత్తాత్రేయ హరేకృష్ణ" ఇత్యాదిగా చెబుతున్నది. దత్తాత్రేయ షోడశావతారాల్లో చిట్టచివరి అవతారం "శ్రీకృష్ణ శ్యామ కమల నయన". ఇవన్నీ మనం గమనించినప్పుడు దత్తుడికీ శ్రీకృష్ణుడికీ గల సంబంధ మేమి ? టనే ప్రశ్న ఉదయించటం సహజం. గోపాలపూర్వతాపిన్యుపనిషత్తు ఏమి చెబుతున్నదో చూడండి!

"కః కృష్ణః ? పాపకర్షణః గోభూమి వేదవిదితో
గోపీజన విద్యాకలాప ప్రేరకః తన్మయా చేతి సకలం
పరంబ్రహ్మైవ తత్. యో ధ్యాయతి రసతి భజతి స
అమృతో భవతి ఇతి. కిం తద్రూపం? సత్
పుండరీకనయనం మేఘాభం వైద్యుతాంబరం
ద్విభుజం జ్ఞానముద్రాఢ్యం వనమాలిన మీశ్వరం"

కృష్ణుడంటే ఎవరు ? పాపములు పోగొట్టేవాడు. గోవు, భూమి, వేదములవలన తానున్నట్లు తెలియబడేవాడు. గోపిజనాన్నీ, వాళ్ళవిద్యాకలాపాన్నీ ప్రేరేపించేవాడు. అతడే మాయ. ఆయనతోనే అంతా నిండిఉంది. అదంతా పరబ్రహ్మమే. ఎవరైతే ఆయన్ను ధ్యానిస్తుంటారో, కీర్తిస్తుంటారో, భజిస్తుంటారో వాళ్ళంతా అమృతత్వాన్ని పొందుతుంటారు. ఆయనరూపం ఎట్లాంటిదనుకొన్నారు? శ్రేష్ఠమైన పుండరీకాల్లాంటి కళ్ళుకలది వార్షుకాభ్రంలాంటి కాంతిగలది. మెరిసిపోయే వస్త్రాలతో కూడి ఉన్నది. రెండు చేతులు గలది. జ్ఞానముద్రతోకూడింది. వనమాలను ధరించింది. అది ఈశ్వర (పరబ్రహ్మ) సంబంధమైంది. ఈవర్ణన సమస్తం దత్తుడికి సరిపోతుంది. దత్తాత్రేయుడు కృష్ణుడికంటే వేరేగాదు.

దత్తాత్రేయుడు యోగానికి మూలస్థానమైతే కృష్ణుడు యోగ ప్రకాశకుడు. దత్తుడినక్షత్రం మృగశిర (రోహిణి?) అయితే కృష్ణుడిది రోహిణి. ఈరెండు అవతారాలు (దాదాపు) రాశిచక్రంలో ఒకే స్థానంలో–వృషభరాశిలో– అవిర్భవించాయి. కాని దత్తాత్రేయుడిలో లాగా కృష్ణుడిలోని యోగతత్త్వం–ఆయనపట్లగల భక్తితత్త్వం

మాదిరి–అంతగా ప్రచారం కాలేదు. ఆయనకూడా ఏ ఉద్ధవుడికో, ఏ అర్జునుడికో తప్ప – అదీ తన జీవితం చివరి దశలో మరెవ్వరికీ యోగతత్వం బోధించినట్లు కనిపించదు. దత్తుడికీ, కృష్ణుడికీ గల పోలికలు చాలా సన్నిహితంగా ఉండి, ఇద్దరూ ఒక్కటే నన్న తత్త్వాన్ని (ఆత్మ స్వరూపంలో) ఖగోళ శాస్త్ర రీత్యా మనం నిర్ధారిం చటాకి వీలు కల్పిస్తున్నది. విచిత్రమేమంటే ఒకరు యోగశక్తిని దత్తం చేస్తుంటే మరొకరు సాధనాఫలితాన్ని అందిస్తున్నారు. ఇదీ రహస్యం! అతి ప్రాచీన కాలంలో విష్ణు తత్వంగా మృగశీర్ష్య (రోహిణి ?) లోపుట్టిన దత్తుడు-తనకు ఒకవైపునగల రుద్రక్షేత్రం (ఓరియన్) తాలూకూ శక్తినీ, మరొక వైపున గల పజాపతి బ్రహ్మస్థానం (ఆరిగ)లోగలశక్తినీ తనలో కలుపుకొని, ఏకైక రూపంగా నిలిచి, రాశిచక్రంలో ఒక విశిష్టస్థానాన్ని ఏర్పరిస్తే ఆతర్వాత చాలాకాలానికి ఆవిర్భవించిన శ్రీకృష్ణుడు అదే స్తానం గుండా బహిర్గతుడై ఆశక్తిని వెల్లడించాడు. దత్తుడిలోనే యోగ మాయ ఉంటే - అది కృష్ణుడినుండి విడివడి, ఆయనతోపాటే సృష్టి లోకి వచ్చింది. తనకు వశ్యమైన ఈ శక్తిని కృష్ణుడు తనలో చోటు కల్పించి, అవసరం తీరగానే బాహ్య ప్రకృతి లోకి విడిచి వెయ్యటం జరిగింది. కానీ దత్తుడి విషయంలో ఈ శక్తి సదా ఆయనలోనే నిలిచి ఉంది. దత్తుడి యోగమార్గం ప్రాచీన సంప్ర దాయానికి చిహ్నమైతే కృష్ణుడిది పరిణితి చెందిన ఒక వినూత్న విధానం. ఈ శక్తిని అవసరమైనప్పుడు ధరించి. మిగతా సమయాల్లో ప్రకృతిలోనే దాన్ని నిలిపి ఉంచగల కొత్తవిధానం కృష్ణుడి వల్ల ఏర్పడ్డది. ఇప్పుడు యోగశక్తిని సంపాయించిన వాళ్ళు దానిని నిలిపి వుంచటానికి పాత విధానంలో ఉన్న క్లిష్టతను

భరించనక్కరలేదు ఈ మలుపు కృష్ణావతారం రీత్యా ఏర్పడింది కృష్ణుడు ఆ శక్తిని తన అవతార కార్యక్రమాలకు పూర్తిగా వినియోగించుకున్నాడు. కనుకనే యోగులు తన ఆత్మస్వరూప మనీ–సగుణస్వరూపం కాదని చెప్పటం జరిగింది విశేషాలు తెలుసు కోగోరేవాళ్ళు శ్రీ మోపర్తి గోపాలరావుగారు రచించిన "దత్తతత్వ విచారం" అనే గ్రంథం చూడవచ్చు.

## 16. దత్తాత్రేయుణ్ణి ఎందుకు ఆరాధించాలి ?

ఉన్న దేవుళ్ళు చాలకనా ? ఇప్పుడీ దత్తాత్రేయుణ్ణి ఎందుకు ఆరాధించాలి ? ఆరాధించకపోతే వచ్చిన నష్టమేమిటి ? అని చాలామంది భావిస్తుంటారు. దత్తాత్రేయుణ్ణే కాదు, ఏదేవుణ్ణయినా ఎందుకు ఆరాధిస్తున్నామంటే–ముఖ్యంగా మన కష్టాలూ, బాధలూ తీరిపోయి సుఖశాంతులు కలగటానికీ, మన కోరికలు నెరవేరటానికీ. అంతేగానీ కేవలం మోక్షం కోసమంటే అది ఆత్మవంచనమౌతుంది. ఆకలితో ఉన్నవాడు అన్నం కావాలనీ, బాధలలో వున్నవాడు బాధలు పోవాలనీ కోరుకోవటంలో తప్పులేదు. అది సహజం కూడా మంత్ర జపంతో శక్తిని పొందాలనుకోవటంలో విడ్డూర మేమీ లేదు లోకంలో ఆర్తులు, అర్థార్థులు నూటికీతొంభై మంది ఉంటే జిజ్ఞాసువులు తొమ్మిదిమంది ఉంటారు. ఇక ముముక్షువులు ఎంతతక్కువగా ఉంటారో మనం చెప్పలేం. జ్ఞానుల విషయానికి వస్తే ఇంకా తక్కువగానే ఉంటారు. మనశక్తి పనికిరానప్పుడు భగవంతుని అనుగ్రహం పొందిన తర్వాతనైనా ఆభగవంతునిపట్ల కృతజ్ఞతకలిగిఉండటం మన కనీసధర్మం. సుఖశాంతులు లభించిన

తర్వాతనైనా మన మనస్సును మోక్షసాధనవైపు (నివృత్తిమార్గం వైపు మనం మళ్ళించవలసి ఉంటుంది.

సత్యం జ్ఞాన మనంతమైన బ్రహ్మను గూర్చి వేదాలు ఘోషిస్తుంటే, ఆతర్వాత వచ్చిన ఆగమాలు, పురాణేతిహాసాలు త్రిమూర్తులనూ, కోటానుకోట్ల దేవతలనూ, సృష్టించాయి. తత్ఫలితంగా అనేక ఆరాధనా మార్గాలు బయలుదేరాయి. విభిన్న ఉపాసనా మార్గాలద్వారా హిందూ సమాజంలో అనైక్యత ప్రబలింది మాదేవుడు గొప్పంటే మాదేవుడు గొప్ప అనే కీచులాట చివికి చివికి గాలివాన అయింది. మనిషికొక దేవుడు వెలిశాడు. మనపూర్వమహర్షులు అవలంబించిన యోగమార్గాన్ని అనుసరించటం మనకు కష్టమైపోయింది. కర్మలు అచరించటం, భగవంతుణ్ణి పూజించటం, తీర్థయాత్రలకు పోవటం, స్తోత్రాలు జపాలు చెయ్యటం భక్తిగా లోకంలో చలామణై అసలు భక్తి మరుగున పడిపోయింది. సనాతన ధర్మం విస్మరించ బడింది ఏ మహాశక్తి ఈలోకంలో ధర్మ వ్యవస్థను చెడిపోకుండా నిలుపుతున్నదో, ఏమహాశక్తి ఎప్పటి కప్పుడు మానవుల్లో ఉన్న అజ్ఞానాన్ని రూపుమాపి మార్గదర్శకత్వం వహిస్తున్నదో ఆశక్తిని మనం మరిచిపోయాం. ఏ మార్గం మోక్షానికీ (బ్రహ్మానందానికీ) రాజమార్గమో, ఆమార్గాన్ని వదిలి పెడదారులు పట్టాం. అశాంతితో కుమిలిపోతున్నాం. అట్లాగాక ఎవరిని మనం ఉపాసిస్తే తక్కువ శ్రమతో ఎక్కువ శక్తిని పొందుతామో, ఎవరు చెప్పిన మార్గాన్ని అనుసరిస్తే సర్వమార్గాభిగమ్యమైన జీవన్ముక్తి శీఘ్రతరంగా లభిస్తుందో. ఎవరు సర్వదేవతా మయులో, ఎవరు సర్వ మంత్రాత్మకులో, ఎవరు సర్వసృష్టికీ మూలమైన పరం

బ్రహ్మ స్వరూపమో, అటువంటి దత్తాత్రేయుల వారినే మనం మ.చి పోయాం. దత్తాత్రేయుడు స్మరణ మాత్ర సంతుష్టుడు. భక్తుల కీర్తిని విస్తరింప చెయ్యాలన్న అకాంక్ష, దీక్ష కలిగినవారు ఇతర దేవీ దేవ మంత్రోపాసనల్లోలాగా మనం ఈదత్తోపాసనలో నియమ బాహుళ్యాలు పాటించవలసిన అవసరం లేదు. చాతుర్వర్ణముల వారూ ఈ దత్తోపాసన అప్రయాసంగా చేసుకోవచ్చు. శీఘ్రంగా ఫలితాన్ని పొందవచ్చు. బాధలు పోగొట్టుకొని ఆత్మశాంతి పొందవచ్చు. అంతిమ ధ్యేయమైన జీవన్ముక్తిని సాధించవచ్చు. సంహితాయన గురు ద్విసాహస్రి (తెలుగు అనువాద గ్రంధానికి) ఉపోద్ఘాతం వ్రాస్తూ, ఆ గ్రంథ అనువక్త అయిన ఆచార్య ఎక్కిరాల భరద్వాజ గారు దత్తుణ్ణి మనం పూజించవలసిన అవసరాన్ని గూర్చి ఎంతో చక్కగా వివరించి చెప్పారు. అది చూద్దాం

అవ్యయుడూ, రూపరహితుడు అయిన పరమాత్మ తన సంకల్పంవల్ల ఈ అనంత విశ్వరూపం ధరించాడు. ఈలా రూపాలను సృష్టించిన ఆయన శక్తిని బ్రహ్మ అనీ, వాటిని పోషించే దానిని "విష్ణు" వనీ, వాటిని సకాలంలో నశింపజేస్తుండే శక్తిని "శివు" డనీ అన్నారు. ఈ మూడు శక్తులూ దేనివో, దేని యందు పనిచేస్తాయో దానిని "పర బ్రహ్మ" మంటారు, పై మూడు తత్వాలూ పనిచెయ్యటం వలన వివిధ ప్రకృతి శక్తులైన దేవతలూ వారి సమిష్టి క్రియ యైన యజ్ఞతా వల్ల వస్తుజాలమూ ఏర్పడతాయి అయితే ఒకానొక శక్తి నీటిలో పనిచేసి తరంగాన్ని లేపినా, మరొక శక్తి ఆతరంగాన్ని కొంతసేపు నిలిపినా, మరల ఇంకొకశక్తి

పనిచేయటం వలన ఆతరంగం లయించినా, ఈశక్తులన్నీ ఏ నీటి యందు పనిచేసాయో ఆనీరు ఆతరంగాలన్నింటి రూపాలలోనూ ఉన్నట్లుగా పరబ్రహ్మము ఈ సమస్త విశ్వంలో శాశ్వతంగా నెలకొని ఉంటుంది. అయితే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లనబడే సృష్టిస్తితిలయకారకులైన శక్తుల సమిష్టి క్రియలో ఒకప్పుడు పరమాత్మ సంకల్పాను సారం జరిగే సృష్టిలో అస్తవ్యస్త మేర్పడు తుంది. అంటే సృష్టి వికాసాన్ని ప్రతిఘటించే శక్తి ఏర్పడుతూ ఉంటుంది, అటువంటప్పుడు సమిష్టియైన పరబ్రహ్మ నుండి అట్టి అస్తవ్యస్తాన్ని సవరించే క్రియ జరుగుతుంది. ఇట్టి అస్తవ్యస్తాన్నే "ధర్మగ్లాని" అనీ, దాన్ని నివారించే ప్రక్రియనే "భగవదవతరణ" మనీ ఋషులు వర్ణించారు. దీనికొక సారూప్యం. మన దేహం జీవించటానికి ఆకలితో అన్నం తింటుంటే, ఒక్కొక్క సారి ముద్ద గొంతుకడ్డం పడి ప్రాణాపాయావకాశం ఏర్పడుతుంది. అప్పుడు శరీరగతమైన ప్రాణశక్తే అవ్యక్తి నీరు త్రాగేలా ప్రేరేపిస్తుంది. అలానే ఇదికూడా. ఒక్కొక్కప్పుడు అన్నపు మెతుకు పొరపాటున శ్వాసకోశంలోకి ప్రవేశించబోతే పొరబోయి ఆ మెతుకును బయటకు వెడలగొట్టి, ప్రాణాన్ని కాపాడుతుంది. ఇలా సృష్టి యొక్క సమిష్టి వికాసానికేర్పడే అవరోధాలే "ధర్మగ్లాని". తన్నివారణమే 'భగవదవతారం'.

ఈలాగాక అనుక్షణమూ శరీరంలో శ్వాస, హృదయస్పందన వంటి నిత్యప్రక్రియలు ఆదేహ మున్నంతవరకూ జరుగవలసిందే. ఆదేహం జీవించడానికి—నిజానికి—అన్నపానీయాలకంటేగూడా ఈ క్రియలే ఎక్కువ అవసరం, నిజానికి ఈ క్రియలు జరుగుతుంటేనే

అన్నపానీయాదిసేవనం సాధ్యం అంటే శ్వాస, హృదయస్పందనాలను నిర్వర్తించేప్రాణశక్తి ప్రాథమికము. అన్నపానాదిసేవనం చేసేసామర్థ్యాలు సహకారులు మాత్రమే. అలానే భగవంతునివ్యక్తరూపము (దేహము)అయిన ఈవిశాలవిశ్వం నిరంతరం చక్కగా కొనసాగడానికి అవసరమైనమరొకదైవశక్తి ప్రత్యేకంగా ధర్మగ్లానిని బాపడానికేగాక సక్రమనిర్వహణకోసంగూడా పనిచేస్తుండాలి.

ఈనిత్యసంరక్షకశక్తియొక్కలక్ష్యం ఒకటున్నది. జీవకోటి అంతా జీవించ యత్నిస్తుంది జీవితమంతా నిత్యనూతానుభూతుల వలన మరింతవికాసం కలిగి జ్ఞానాన్ని సంపాదిస్తుంది. తద్వారా మరింతఉత్తమంగానూ, సుఖసంతోషాలతోనూ జీవించడం నేర్చుకోజూస్తుంది. ఇదే ధర్మజిజ్ఞాస కల్గి, ధర్మాన్ని తెలిసి ఆచరించడంగా మానవచరిత్రలో ప్రకట మౌతుంది. ఈజిజ్ఞాస చివరికి ఆత్మజ్ఞానంతోగాని పూర్తిగాదు. అంతవరకూ జీవికి స్థిరమైన తృప్తి, శాంతి లభించవు. తనలోని "నేను"అన్నప్రజ్ఞ వాస్తవానికి జననమరణరహిత మని తెలిసేదాకా మృత్యుభీతి వీడదు. అంతవరకు జీవికి స్థిరసుఖరూపమైన శాంతి కలుగదు.

"అంటే-అన్నపానాదినైమిత్తికావసరాలను నెరవేర్చే శక్తులు దేహంలో సకాలంలో ప్రకటమై అవసరంతీరంగానే ఉపశమించినట్లు రామకృష్ణాద్యవతారాలు, సృష్టి అనే ఈ పరమేశ్వరదేహంలో అవతరించి, కాలబద్ధమైన అవసరాలను నెరవేర్చి నిర్యాణంచెందుతుంటే, మరొకవంక ఈవిశ్వాన్ని ధర్మాచరణద్వారా అనుక్షణమూ చక్కగా మనేలా చూస్తూ, జీవులను ఆత్మజ్ఞానోన్ముఖులను చేస్తూ,

జీవితపరమార్ధంవైపుకు కృషిచేసేలా ప్రేరేపించి, సహకరించి, కృతార్థతనిచ్చే భగవత్తత్త్వం ఎల్లప్పుడూ సృష్టిలో పనిచేస్తుండా లన్నమాట ! ఇట్టిశక్తి దత్తాత్రేయస్వామిఅవతారంగా, ఎల్లప్పుడూ భూమిమీద విజయంచేస్తుంటారనీ, తమ మహిమచేత జీవులను ధర్మాచరణకూ, ముముక్షుత్వానికీ కృషిచేసేలా ప్రోత్సహిస్తారనీ పురాణాలలో చెప్పబడింది. ఈసత్యాన్నే భాగవత మీలా చెప్పింది. భగవంతుడు మహర్షులకు ధ్యానబలంవలన వారి హృదయాలకి మాత్రమే గోచరుడు. అట్టి తపోనిష్ఠ సర్వులకూ సాధ్యంకాదు. కనుక జీవులపట్ల అపార కరుణచేత వారందరికీకూడా తాను లభ్య మయ్యేందుకు పరిపూర్ణులైన మహనీయుల రూపంలో ఎల్లప్పుడూ భూమిపై సంచరిస్తూఉంటాడు. వీరందరిరూపాలలో ఎల్లప్పుడూ ప్రకటితమయ్యే భగవత్తత్వమే శ్రీదత్తాత్రేయుడు. అందుకనే ఆయనను "యోగనాథుడు"అని భాగవతం కీర్తించింది (కేవలం ఈకారణంచేతనే గాదు. యోగశక్తిని తొలుదొలుత ఈప్రపంచం లోకి అవతరింపజేయటంవల్ల, వేదాలను సముద్ధరించి, వాటి సారమైన ఆత్మోపాసనను ప్రవేశపెట్టి. నూతనయోగమార్గానికి శ్రీకారం చుట్టటం వల్ల, కర్మభక్తిజ్ఞానాలను ఒక్కొక్కదాన్ని ఎట్లా యోగంగా మలచుకోవాలో తెలిపి, ఆమూడింటినీ ఒకమహాయోగంగా ఏలా రూపొందించుకోవాలో తేటతెల్లం చేయటంవల్లా ఇత్యాది అనేక కారణాలవల్ల ఆయన యోగనాథుడుగా కీర్తించబడ్డాడు శ్రీమద్భాగ వతషష్ఠస్కంధంలో, అష్టమాధ్యాయంలో ఉన్న నారాయణకవచ మందు (ఈకవచాన్ని ఒకప్పుడు దేవతలకు గురువుగాఉన్న త్వష్ట ప్రజాపతికుమారుడైన విశ్వరూపుడు దేవతలకు ఉపదేశించాడు)

"దత్త స్త్వయోగాదథ యోగనాథః పాయాత్" యోగనాథుడైన దత్తుడు నన్ను అయోగమునుండి రక్షించుగాక!" అని కలదు. హరివంశంలో వైశంపాయనుడు "భూయో భూతాత్మకో విష్ణుఃప్రాదుర్భావో మహాత్మనః దత్తాత్రేయ ఇతిఖ్యాతః" విష్ణువు దత్తాత్రేయుడై అవతరించా డని చెప్పి, వేదాలూ, యజ్ఞక్రియలూ, చాతుర్వర్ణాలూ మొదలైన వాటినన్నింటినీ దత్తుడు పునరుద్ధరించా డని చెప్పాడు. అప్పుడేకాదు. ఇప్పుడుగూడా ఆయన అనేకగురుస్వరూపాలుగా లోకంలో వెలిసి జ్ఞానప్రబోధంచేస్తూ ధర్మాన్ని సంరక్షిస్తూనే ఉన్నాడు. భారతీయ సంప్రదాయంలో విశిష్టమైనదిగా పరికీర్తింపబడుతున్న "గురుపరంపర"కుఎటువంటి విచ్ఛిన్నం కలుగకుండా కాపాడుతునే ఉన్నాడు. ఇది దత్తాత్రేయులవారివిశేషలక్షణం సుఖశాంతులలోకూడిన ధర్మబద్ధమైన జీవితవిధానాన్నీ, దానిపర్యవసానమైన పరమార్గాన్ని పొందాలంటే ఈదత్తాత్రేయుణ్ణి మనం ఆశ్రయించకతప్పదు. అంటే పరిపూర్ణులైన మహనీయులరూపంలో భూమిపై ఎల్లప్పుడూ అవతరిస్తున్న ఆస్వామిని మనం సేవిస్తూ, అజ్ఞానాన్ని తొలగించుకొంటూ ఉండాలన్నమాట. గురువునే దత్తాత్రేయుడిగా భావించి జీవిత పరమార్థాన్ని మనం సాధించాలన్నమాట !

దత్తాత్రేయుడు జీవితపరమార్థాన్నేకాదు. మునుముందుగా మనభౌతికఅవసరాలను తీర్చి, తృప్తినీ, ప్రశాంతినీ కలిగించటం ఆయన ప్రత్యేక లక్షణం. ఆయన్ను ప్రసన్నం జేసుకోవడంకోసం, అనుగ్రహం సంపాదించటం కోసం ఎన్నో స్తోత్రాలూ, కవచాలూ, హృదయాలూ, మాలామంత్రాలు వెలిసాయి. వాటిలో ఏఒక్కదాన్ని మనం పట్టుకొని త్రికరణశుద్ధిగా ఉపాసించినా ఫలితం వెంటనే

కనిపిస్తుంది. ఇట్లా అయన్ను సగుణోపాసన చేస్తుంటే-క్రమక్రమంగా మనసాధనను నిర్గుణంవైపు ఆయనే మళ్ళిస్తాడు. ఆత్మానందం చేకూరుస్తాడు. జీవన్ముక్తి కలిగిస్తాడు. నేటి సమాజంలో మానవ సమైక్యతను సాధించాలంటే దత్తోపాసన ఒక్కటే శరణ్యం. పరబ్రహ్మ, మాయ ఒక్కటేఐనా మాయా(దేవి)మంత్రాలు జపించి పరమార్థాన్ని చేజిక్కించుకోవటం చాలాకష్టం. మాయను ఉపాసించే వాళ్ళు మాయలోనే పడకతప్పదు. ఈమాయను ఛేదించే మహాశక్తి ఏ రామకృష్ణపరమహంసలాంటివాళ్లకో తప్ప అందరికీ లభించదు. ఈమాయను ఛేదిస్తే కనిపిచేది దత్తుడే. మాయావరణంలో ఉన్న అవ్యక్తుడు ఆదత్తుడే. ఈడొంకతిరుగుడు మానేపి సరాసరి దత్తుణ్ణే ఆశ్రయిస్తే ఆమాయాయుక్తావధూత మాయాముక్తుడౌతాడు. అనుగ్రహిస్తాడు. ఆఅవధూత ప్రసాదించిన అవధూతగీత, జీవన్ముక్త గీత మనిషిని మహామనిషిగా, దివ్యుడిగా తీర్చిదిద్దటానికి, ఆయన అనుగ్రహం పొందటానికి, జీవిత పరమార్థం చేజిక్కించుకోవడానికి ఎంతగానో సహకరిస్తవి ఆయనమంత్రాల్లో ఒక్కొక్కటీ అనంతమైనశక్తిని ప్రసాదించి మానవుణ్ణి శక్తికేంద్రంగా మార్చగల మహాశక్తివంతమైనవి ఆయన చెప్పిన త్రిపురారహస్యమైతే పరాశక్తికీ తనకూ భేదం లేదనీ-చిచ్ఛక్తిస్వరూపమే తాననీ తెలిపేది. కల్పవృక్షాన్ని ఎదురుగా పెట్టుకొని, దాన్ని పట్టించుకోక అజ్ఞానంతో పెడదారులు పట్టడం ఎంతఅవివేకమో మనం యోచించాలి. దత్తుడు యోగాధినాథుడే కాదు. ఆధ్యాత్మిక సామవాదిగూడా. యోగ సాధన లన్నింటినీ సంయోగపరచిన (కర్మ, భక్తి, జ్ఞానాలను ఒక్కొక్కదాన్ని యోగంగా మలచి-కలిపి మహాయోగంగా రూపొం

ద్ధించిన) పరమాత్మ ఆయన. ఆయనప్రబోధాలు విశ్వ శాంతికిదోహదాలు. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతాలూ, మాయావాద, పరిణామవాద, చిద్విలాసవాదాలూ మొదలైనవాటికన్నింటికీ,' చక్కటిసామరస్యం ఘటింపజేసా డాయన. ఈనాడు కులమతాలకు అతీతంగా, ప్రాంతాల కతీతంగా, మానవుల్ని సంఘటితంచేసి, సమైక్యపథంలో నడిపించగలిగేది ఒక్క దత్త సంప్రదాయమే నన్నమాట మనం మరచిపోరాదు.

"దత్తాత్రేయతత్త్వవిచార"మనే గ్రంథంలో మోపర్తి గోపాల రావుగారు ఒక విషయం చెప్పారు. అది కూడా మనం తెలిసికోవటం అవసరం. నక్షత్రరూపమైన దత్తునిఖగోళంలో (వృషభరాశిలో) సూర్యకుటుంబంలోని గ్రహాలన్నీ (యురేనస్, నెప్ట్యూన్ తప్ప) కలవ బోతున్నాయి (గ్రహకూటమి రాబోతున్నది). దానివల్ల భూ అయస్కాంతక్షేత్రంలోనూ, గురుత్వాకర్షణ పరిధుల్లోనూ గొప్ప మార్పులు సంభవించే అవకాశం ఉన్నది. దత్తుడు మూడుశిరస్సు లలో, రుద్రాంశకు సంభంధించింది "ఓరియన్" అనే నక్షత్రంలోనూ, బ్రహ్మాంశకు సంబంధించింది "ఛారిటీయర్" లేక "ఆరిగ" అనే నక్షత్రంలోనూ, మధ్యలో-పాలపుంతసమీపంలోని రోహిణీ నక్షత్రంలో విష్ణువుకుసంబంధించింది ఉన్నట్లు మనం లోగడ చెప్పుకొన్నాం. ఈవృషభరాశినే పాశ్చాత్యులు Hades (హేడ్సు) అంటే నరకతుల్యమైందని భావిస్తారు. పాలపుంతకు రెండువైపులా "మృగవ్యాధరుద్రు"డనే Sirius (సిరియస్–గ్రేటర్ డాగ్) మరియు "ప్రైకన్"(లిటల్ డాగ్) అనే నక్షత్రా లున్నాయి మృగవ్యాధరుద్ర నక్షత్రాన్నే (సిరియస్ నే) "కాలభైరవ నక్షత్ర"మని కూడా పిలుస్తారు

కొన్ని సాంప్రదాయాల్లోనైతే దీన్ని "ప్రళయ నక్షత్ర" మనీ (Dooms day star) భూవాసుల పాపపుణ్యాలను లెక్కించే (Judger of nations) నక్షత్రమనీ చెప్పబడు తున్నది. ఇది సూర్యుడికంటే 24 రెట్లుకాంతివంతమైనది. ఇక పరిమాణంలో ఇది ఎంత పెద్దదంటే – దీన్ని మనం సూర్యుడి స్థానంలో ఉంచితే సూర్యకుటుంబం యావత్తూ (ప్లూటో ఇత్యాది దూరగ్రహాలతోసహా) దీనిలో ఇమిడిపోతుంది. ఈ నక్షత్రంనుంచే చాలా మార్పులు సంభవించే అవకాశమున్నదని (సిరియస్ ఎఫెక్టు) చాలా మంది యోగులూ, శాస్త్రజ్ఞులూ భావిస్తున్నారు సారాంశం ఏమిటంటే దత్తాత్రేయుడి రూపంలో వున్న శక్తే ఓరియస్, సీరియస్ నక్షత్రాల నుండి అనతికాలంలోనే (ఈ దశాబ్దం చివరకు) భూవాసులకు చేరబోతున్నది అది పూర్తిసంహారక శక్తి. అది జరిగిననాడు ప్రళయం తప్పదు యుగాంతం తధ్యం. చాలామంది అంచనా ప్రకారం ఈశతాబ్దాంతం క్రీ.శ 2000 సం॥లో జరిగితే ఆరు సంవత్సరాలకాలంలో ఆధ్యాత్మికపరులు తమ జీవనవిధానంలో తగిన మార్పులు చేసుకొనే వీలున్నది. అందుకు వీలుగా దత్త ప్రభుపు ఇటీవలికాలంలో–ఇంతకుముందెన్నడూ లేనంతగా–తన ప్రాబల్యాన్ని, అనుగ్రహాన్నీ చూపిస్తూ, తనసంప్రదాయాన్ని (సాయినాధునిసంప్రదాయం ద్వారా.... వివిధగురుస్వరూపాలుగా) విస్తరింపజేయటం మనం చూస్తున్నాం

## 17. దత్త తత్త్వరహస్యం

"బిందు త్రికోట షట్కోణం దత్తాత్రేయస్వరూపకం", త్రికోణాంతర్బిందురూపం దత్తాత్రేయం", "బిందు త్రికోణ షట్కోణ

మధ్వరణరహస్యకం, బ్రహ్మరంధ్రాదిపాదాంతం శరీరం యంత్ర రూపకం", "దత్తాత్రేయో బిందురూపో బ్రహ్మరంధ్రస్థితోऽస్మ్యహం, ద్వారావరణసంయుక్తం శీర్షాదిచరణాంతకమ్", "ద్రా"మిత్యేకాక్షరం జ్ఞేయం బిందునాదకళాత్మకం" ఇత్యాదిగా మంత్రశాస్త్రంలో దత్త తత్త్వం వివరించబడింది.

దత్తాత్రేయుడు త్రిమూర్తి స్వరూపం ఈ త్రిమూర్తుల భార్యలైన సరస్వతీ, లక్ష్మీ, పార్వతీ సృష్టిలోని ప్రకృతిఅంశకు చిహ్నమైతే, పురుషాంశకు త్రిమూర్తులు చిహ్నాలు ప్రకృతి పురుషుల కలయికయే ఈ సృష్టికి మూలం త్రిగుణాత్మకంగా ఉన్న ఈ సృష్టిలో పురుషాంశకు సంబంధించిన మూడుచిహ్నాలూ, ప్రకృతి అంశకు సంబంధించిన మూడుచిహ్నాలూ కలసి మూడుజంటలుగా ఉండే ఆరుశక్తులుగా మనం భావించవచ్చు. ఈ ఆరుబిందువులు (ఆరుశక్తులు) కలసి, ఒకటి ఊర్ధ్వమైనత్రికోణం, మరొకటి అధోముఖమైన త్రికోణంగా ఏర్పడి; ఒకదానిపై ఒకటి చేరిస్తే షట్కోణతారగా ఏర్పడుతుంది ఇది మనభ్రూమధ్యంలో ఉండే ఆజ్ఞాచక్ర మని యోగశాస్త్రం చెబుతున్నది. ఇదిషట్చక్రాలలో అన్నింటికంటే పైస్థానంలో ఉన్నది దీనిపైన అమృతబిందుస్థానమైన సహస్రారచక్రం ఉంది. ఆజ్ఞాచక్రంలో ఉండే జ్ఞానశక్తి యోగశక్తిగా మారి చిట్టచివరకు చేరవలసినస్థానం అదే! ఆజ్ఞాచక్రంలోని ఆరు బిందువులలో తామసప్రధానమైనజంట ముందుగా కలిసి (తమ ద్వంద్వాలను వీడి) రాజసప్రధానమైనజంటతో కలిసి, ఏకత్వాన్ని పొంది. ఆతర్వాత ఈ రెండూ సత్త్వప్రధానమైనజంటతో కలిస్తే, అప్పుడు త్రిగుణాతీతమైనస్థితి ఏర్పడుతుంది. వేదాతీతస్థితి అంటే అదే! అట్టి

శక్తి సహస్రారమును చేరి, అమృత బిందుస్థానంలో కలిసిపోవటమే యోగపరాకాష్ట. "ద్రాం" అనే దత్తబీజం బ్రహ్మరంధ్రమందు (సహస్రారంలో) ఉంటుందని చెప్పడానికి కారణం ఇదే! పైన చెప్పిన ఊర్ధ్వముఖమైనత్రికోణం దైవీప్రకృతి చిహ్నం. హృదయ స్థానంలో ఉండేఅనాహతంనుండి క్రిందఉన్న మూడుచక్రాలనూ అధోముఖమైన త్రికోణం కలుపుతుంది. దానితో కలువకుండా అనాహతమునుండి జ్ఞానంచక్రంవరకూ ఊర్ధ్వమైనత్రికోణం ఏర్పడు తున్నది. అది దైవత్వసంజ్ఞ కలది, సాధకుడు తన సాధనద్వారా ఈఅధోముఖమైనత్రికోణాన్ని క్రమక్రమంగా దైవత్వంవైపు నడిపి నప్పుడు (ఊర్ధ్వమైన త్రికోణంతో కలిపినప్పుడు) అతనిలోనిజీవశక్తి ఆజ్ఞాచక్రంలోని జ్ఞానశక్తిగా మారుతుంది. అంటే జీవప్రకృతినుండి దైవప్రకృతిగా మారుతుంది. అప్పుడు జీవాత్మ దైవత్వంలోని ఉన్నతస్థితిని (నిర్గుణయోగశక్తిని)ధారణ చేయగలశక్తిని పొందు తుంది. ఇట్టిశక్తిని సాధించినవ్యక్తి జీవన్ముక్తుడు. ఇది యోగ పరాకాష్ఠదశ.

యోగమార్గంలో విగ్రహారాధన, పూజలు వీటి ప్రమేయం ఉండదు. ఇది కేవలం ఆత్మయోగం. ప్రకృతిలోని ప్రతిఅంశానికీ మనలోని ప్రతిస్పందన ఎట్లా ఉంటుందో గమనించ టం అభ్యాసం చేయాలి. ప్రకృతిలోని 24 అంశలలో ఏది ఈ ప్రతిస్పందన కలిగిస్తున్నదో గమనించి, అది ఒకవేళ తామసరాజస గుణవిశేషంగా కనిపిస్తే దానిని వదలిపెట్టటం నేర్చుకోవాలి. కామ క్రోధాదులుకలిగించేవికారాలు గుర్తించి, వాటిని సత్త్వగుణంతో లయింపచెయ్యాలి. సత్త్వగుణాన్ని మనస్సులో నిలబెట్టుకోగలిగితే,

ప్రకృతిలోని 24అంశలు దానితో కలసి, ఒకేఆవరణలో మన ఆత్మ శక్తి నిలిచి అవ్యక్తానికి చేరువౌతుంది. ఈ విధానాన్నే జీవన్ముక్త గీతలో, 24 శ్లోకాలలో దత్తుడు సూచించాడు. అవిధానాన్ని మనం పరిశీలించి అర్థంచేసుకోవలసిన అవసరముంది. ఈవిధంగా దత్తుడు యోగమార్గం (జీవన్ముక్త పద్ధతి) చూపించాడు. అయితే-అనేకమంది, సులువుగా ఉంటుందని, దత్తుడిమార్గాన్ని సగుణారాధనగా మార్చి (మిగతా అన్నిదేవతామూర్తులులాగానే సగుణారాధనగా మార్చి) అసగుణారాధన ఫలితాన్నే పొందుతున్నారు. దత్తసంప్రదాయంలో యోగీశ్వరతత్త్వాన్ని పొందదలచినవారు, పూర్తిస్వార్థ త్యాగానికి సిద్ధపడి, అతి నిర్లిప్తమైన మానసిక వైరాగ్యంతో మాత్రమే దత్తశక్తిని ధారణచేయగలఅర్హతను పొందుతారు. అట్లాగాక త్రిమూర్త్యాత్మకమైన దేవతా స్వరూపంగా కొలిచేవాళ్ళు విశిష్టమైన దైవసంపదను మాత్రమే పొందగలుగుతారు.

అవాఙ్మానసగోచరమైన దత్తతత్త్వాన్ని వివరించాలంటే అది మానవమాత్రులకు సాధ్యమయ్యే పనికాదు. దత్తతత్త్వాన్ని క్రమక్రమంగా మనం అనుభవంలోకి తెచ్చుకుంటుంటే దత్తాత్రేయుడు సచ్చిదానంద స్వరూపుడు కనుక మనకు బ్రహ్మానందాన్నే ప్రసాదిస్తాడు.

వేద ప్రతిపాదితమైన పరబ్రహ్మకు 1 నిష్కలారూపం, 2 సకలారూపం, 3 నిష్కలాసకలా రూపం అని మూడు రూపాలున్నవి. నిరామయం, నిరంజనం, అవాఙ్మానసగోచరం, సూక్ష్మం ఇత్యాదిగా ఏది చెప్పబడుతున్నదో అదిపరబ్రహ్మ యొక్క "నిష్కలా రూపం". ఈ పరబ్రహ్మకు సహజమైన మూలప్రకృతి ఒకటుంది.

ఇదేమాయ, (అవిద్య) పరబ్రహ్మయొక్క నిష్క్రియా రూపమెట్లా సర్వతంత్రస్వతంత్రమో మూలప్రకృతికూడా అట్లాసర్వతంత్రస్వతంత్రమే పరబ్రహ్మ సర్వకారణకారణమైన విధంగానే మూలప్రకృతి కూడాసర్వకారణకారణమే. ఈ రెండూ సకలచరాచరసృష్టికి ఉపాదానకారణములే! మూలప్రకృతితో గూడిన రూపమే "నిష్కలా సకలారూపం". పరబ్రహ్మ ఆత్మశక్తి క్రీడితుడైనంతనే "సకలా రూపం" ఉదయించింది ఆ సకలారూపమే శ్రీ దత్తాత్రేయుడు.

శాండిల్యోపనిషత్తు మూడవ అధ్యాయంలో ఈ విషయమే చెప్పబడింది. "యస్మాత్ సుదుశ్చరం తపస్తప్యమానాయ అత్రయే పుత్రకామాయాతితరాం తుష్టేన భగవతా జ్యోతిర్మయేన ఆత్మైవ దత్తో యస్మాచ్చాన సూయాయాం అత్రేః తనయోఽభవః. తస్మాదుచ్యతే దత్తాత్రేయ ఇతి" పుత్రార్థియై అత్రి మహాముని చేస్తున్న కష్టసాధ్యమైనతపస్సుకు మెచ్చి, ఆయనకు దత్తుడైనందున, అత్రి కుమారుడై అనసూయకు పుట్టినందున "దత్తాత్రేయు"డని ఆయనకు పేరువచ్చిందని దత్తాత్రేయ శబ్దానికి అర్థం చెప్పబడింది. "ఓం సత్యక్షేత్రే బ్రహ్మనారాయణం మహాసామ్రాజ్య కిం తారకం తతో బ్రూహీ త్యువాచ భగవా నిత్యుక్తా స్సత్యానందచిదాత్మకం సాత్వికం మామకంధామోపాస్వే త్యాహ సదా దత్తోఽహ మస్మీతి ప్రత్యేతత్స్వవదంతి యేనతే సంసారిణో భవంతి నారాయణేనైవం వివక్షితో బ్రహ్మ విశ్వరూపధరం విష్ణుం నారాయణం దత్తాత్రేయం ధ్యాత్వా సద్వదతి" అని దత్తోపనిషత్తులో దత్తాత్రేయుడు 'సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మ' అని స్పష్టం చేయబడింది.

దత్తోపనిషత్తును జాగ్రత్తగా పరిశీలిస్తే దత్తుడు పరబ్రహ్మమనే విషయం మనకు బోధపడుతుంది. ఉపనిషత్తుమొదట్లో బ్రహ్మ సత్యక్షేత్రంలో నారాయణుణ్ణి "సంసారసాగరాన్ని తరింపజేసేనావ యేది?" అని అడిగితే "స్వచ్ఛమైన, సచ్చిదానందస్వరూపమైన నాతత్త్వాన్ని ధ్యానించు. నేను సదా దత్తుణ్ణి" అని నారాయణుడు చెప్పాడు. ఉపనిషత్తు చెప్పిన అన్నిమంత్రాలలోనూ ఋషి సదాశివుడు. దేవత (ధ్యానవిషయం) దత్తాత్రేయుడు ఆ ఉపనిషత్తు ద్వితీయఖండం "ఓంనమో భగవతే దత్తాత్రేయాయ" అని దత్తుడికి నమస్కారంతో మొదలై, "ఓంనమశ్శివాయ" అని శివ నమస్కారంతో అంతమౌతున్నది అంటే సదాశివుడే శివుడనీ, దత్తాత్రేయుడు సదాశివుడికంటే వేరుగాదనీ మనకు తేలుతుంది శివుడు, సదాశివుడు లేక మహేశ్వరుడైన దత్తాత్రేయుడే శ్రీమన్నారాయణుడని ఈఉపనిషత్తు మనకు వెల్లడిస్తున్నది ఇది ఒకేపర తత్త్వంలోని దైవత్వం యొక్క ఏకత్వం జ్ఞానంద్వారా అది పొందదగినది. ఏకత్వమనే సత్యాన్ని ఎప్పటికైనా మనం తెలుసుకోవలసిందే! ఆ సత్యమే బ్రహ్మము. దత్తాత్రేయ నామం యొక్క అర్థాన్ని వివరించటంలో ఆఉపనిషత్తు ఈసత్యాన్నే వెల్లడించింది. దత్తాత్రేయస్వామివంటి సకలారూపం మరొకటి లేదు. విలక్షణమైన దత్తాత్రేయుడి పరమరహస్యతత్త్వం ఇదే!

త్రిమూర్తిం త్రిగుణం త్ర్యర్ణం త్రిశక్తిం త్రిస్వరం త్రికం
త్రికోణాంతర్బిందురూపం దత్తాత్రేయం భజామ్యహం॥
బిందుత్రికోణషట్కోణం దత్తాత్రేయస్వరూపకం
సహ్యశాయన మాత్రేయం అవధూతం నమామ్యహం॥

ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త

# శ్రీ దత్తాత్రేయకల్పసంగ్రహము

ఒకానొకప్పుడు కిరాతరూపధారులై పార్వతీ పరమేశ్వరులు యథేచ్ఛగా విలాసవిహారం చేస్తున్న సుఖసమయంలో, పార్వతీదేవి శివుణ్ణి చూచి "పూర్వం మీరు నాకు అభ్రమతీ, భద్రసావతీ, వారాహీ, బగళాముఖీ, యక్షిణీ, కార్తవీర్యార్జునాదిమంత్రా లెన్నో ఉపదేశించారు. కాని దత్తాత్రేయ మంత్రాలను గురించి ఏమీ చెప్పలేదు. ఆ మంత్రాలు మహాశక్తిమంతాలనీ, తక్కిన మంత్రాల్లాగా వాటిని ఉపాసించేటప్పుడు కఠోరనియమా లేవీ పాటించ నవసరం లేదనీ, అవి శీఘ్రంగా ఫలమిస్తాయనీ విన్నాను. వాటి విశేషాలు వినాలని చాలా కుతూహలంగా ఉన్నది. ఆ విషయం సవిస్తరంగా తెలియజేయండి" అని అడిగింది అప్పుడు శబర వేషధారియైనశివుడు పార్వతికి దత్తమంత్ర, యంత్ర తంత్ర విశేషాలనూ, మంత్రహోమ ప్రక్రియలనూ వివరించి చెప్పాడు. ఆవిషయమంతా "దత్తాత్రేయ కల్పం"లో ఉంది. ఆ గ్రంథంలోని విషయమే ఇక్కడ సంగ్రహించబడింది.

దత్తాత్రేయమంత్రాల కన్నింటికీ శబరవేషధారియైన శివుడే ఋషి. ఆమంత్రాలు చాలావరకు గాయత్రీ ఛందస్సులోనే ఉంటాయి. దత్తాత్రేయ మంత్రానుష్ఠానానికీ, మిగతా దేవతల మంత్రానుష్ఠానానికీ చాలాతేడా ఉంది. దత్తాత్రేయమంత్రానుష్ఠానానికి అంతగా నియమాలు ఏమీలేవు. ఏవో సామాన్య నియమాలే చెప్పబడ్డాయి. ఆనియమాలైనా తక్కినమంత్రాలను చూచి, అట్లా ఉంటే బావుంటుందని ఆతర్వాతి సాధకులు ఏర్పాటు చేసుకున్నవే గాని మౌలికాలు కావు. పూజ, స్తోత్రము, మంత్రజపము, కవ

చము, పంజర స్తోత్రము, దత్తహృదయము, సహస్రనామము, ఇట్లా ఎన్నో ఉపాసనాపద్ధతులు కాలక్రమమున ఏర్పడ్డవి. దీనికి తోడు తంత్రములు, యంత్రములు. ఈరెండూ మంత్రముతో కలసి జోడుగా పోయేవే. ఇక మంత్రాల విషయానికి వస్తే దత్తాత్రేయ ఏకాక్షరితోబాటు ఎనిమిది సుప్రసిద్ధమహామంత్రాలున్నాయి. వాటితోబాటు మరికొన్ని మంత్రాలు వెలిసాయి. అందులో ఉపాసనా పద్ధతి - గురుసంప్రదాయాన్ననుసరించి మళ్ళీ ఎన్నో పాఠాంతరాలు. మహామంత్రాల్లో మాలామంత్రం ఒకటి ఉంది. బీజ సంపుటీకరణమే ఆ మంత్రం. దానికి దత్తవ్యాహృతి అనేపేరు కూడా ఉంది. అది మంత్రఖడ్గంలా కూడా పనిచేస్తుంది. నియమనిష్ఠలతో ఉపాసిస్తే దానివల్ల అత్యధికశక్తి సాధకుడికి వస్తుంది. కొన్ని శక్తివంతమైన రహస్యస్తోత్రాలు—మంత్రగర్భితాలుగా— "రుద్రయామళం" లో చెప్పబడ్డాయి. "దత్తాత్రేయసంహిత"లో మరికొన్ని ఉన్నాయి. ప్రతిమంత్రానికీ దానికి సంబంధించిన గాయత్రి ఉంటుంది అట్లాగే దత్తమంత్రానికీ ఉంది. విశేషమేమిటంటే దత్తసంప్రదాయంలో "గురుగాయత్రి" కూడా ఉంది. మంత్రాన్ని ఎంత జపించమని ఉంటుందో ఆ సంఖ్యలో దశాంశము మంత్రగాయత్రి జపం చెయ్యాలి. తద్దశాంశము మాలామంత్ర జపం చెయ్యాలి. ప్రతి మంత్రానికీ కరాంగన్యాసాలూ, దిగ్బంధనదిగ్విమోకాలూ, ధ్యానం, పంచపూజలూ—ఈ సరంజామా అంతా ఉండనే ఉంటుంది. ప్రతిమంత్రానికీ ఇది సర్వసామాన్యమే మేరుతంత్రం 'ఇవన్నీ అనవసరం" అని అంటుంది. దానిదృష్టిలో మూలమంత్రమే ప్రధానం. దాని ఉపాసనే ముఖ్యం. దత్తోపాసనలో నియమా లక్కరలేదంటే

లేదని అర్థంగాదు. డాంభికాచారాలు నిష్ప్రయోజన మని. భావ నిష్ఠప్రధాన మని. అంటే నియమాలను పెట్టుకొని—అప్రకారంగా ఒకపద్ధతి ప్రకారం పూజ, స్తోత్రాలు చేస్తూ మంత్రజపం చేస్తే దానిఫలితం దానికి ఉంటుంది ఇవేవీ లేకుండా కేవలం మంత్ర జపం చేస్తూ తనకిష్టమైన ఏకవచాన్ని పఠించినా, ఏమాలామంత్రాన్ని పఠించినా, ఏస్తోత్రం చేసినా, స్మరణమాత్రసంతుష్టుడైన దత్తుడు అనుగ్రహం వర్షించి దివ్యదర్శనం ప్రసాదిస్తాడు.

దత్తమంత్రాలకు తర్పణబాహుళ్యాలు లేవు. పూర్వాంగాను ష్ఠానము, పూర్వాంగసేవ మొదలయినవి మనము తప్పనిసరిగా చేయనవసరం లేదు. చేయదలుచుకున్న వాళ్ళు చేయవచ్చును. వాళ్ళైననూ అవి అన్నీ ఒకవరుస ప్రకారము, క్రమము తప్ప కుండా చేయవలె నను నియమమేదీ లేదు. "క్రమం పాటిస్తూ ఇష్టమైన వాటిని చెయ్యవచ్చు. ఇక పూజావిషయంలో సహస్ర నామపూజ చేస్తే తప్పకుండా మనం అష్టోత్తరశతనామపూజ చెయ్యాలి. ఒక అష్టోత్తరశతనామపూజనే చెయ్యాలనుకొన్నప్పుడు సహస్రనామార్చనతో అవసరం లేదు స్తోత్రపారాయణ విష యంలో ఈ నిబంధన లేదు మనవీలునుబట్టి, శక్తినిబట్టి దత్తా త్రేయఅనుష్ఠానం విధివిధానంగా చేయవచ్చు లేదా లఘువుగానైనా చేసుకోవచ్చు. మానసికంగాకూడా చేసుకోవచ్చు. దత్తసంప్ర దాయంలో మానసికపూజకే పెద్దపీట వేయటం జరిగింది. అనుష్ఠాన విషయంలో క్రియకుగాక భక్తికీ, ఏకాగ్రతకూ ప్రాధాన్య మీయ వలెను. దత్తమంత్రానుష్ఠానం చేస్తూ, దత్తసంబంధమైన గ్రంథాలు

పారాయణం చేస్తూ, ఇంటికి వచ్చినవాళ్ళకు మాధ్యాహ్నిక భిక్షా విధి పాటిస్తూ సదా దత్తధ్యానంలో ఉంటున్న సాధకుడికి దత్తాను గ్రహం త్వరలో లభిస్తుంది

**దత్తమంత్రాలు - రకాలు :**

దత్తాత్రేయమంత్రాల్లో 1) ద్వాదశాక్షరి 2) షోడశాక్షరి 3) షడక్షరి 4) అష్టాక్షరి 5) ఏకాక్షరి 6) వింశత్యక్షరి 7) అనుష్టుప్ 8) మాలా అనే ఎనిమిదిమంత్రాలు సుప్రసిద్ధమైనవి. ఆమంత్రా లన్నీ ఎంతో శక్తిగలవి. అవన్నీ అభీష్ట సిద్ధిని కల్గించేవే. వాటిని భక్తిశ్రద్ధలతో ఉపాసిస్తే భోగభాగ్యాలూ దీర్ఘాయుస్సూ, అణిమాదిఅష్టసిద్ధులూ, జల అగ్నిస్థంభనాదివిద్యలూ, దూరశ్రవణ, దూరదర్శనాది మహాశక్తులూ సాధకుడికి కల్గుతాయి.

సప్తకోటి మహామంత్రా లన్నీ కలిసినప్పటికీ దత్తాత్రేయ మహామంత్రంతో వీసమెత్తుకూడా సరితూగలేవు. ఇంద్రాది అష్ట దిక్పాలకులూ, ముప్పదిమూడుకోట్ల దేవతలూ, బ్రహ్మ విష్ణు మహేశ్వరులూ, దత్తోపాసకుడిపట్ల అత్యంత సంతుష్టదయాహృదయులై అతని అధీనంలో ఉంటారు. దత్తమంత్రోపాసకుడికి ఈముల్లోకాలలో అసాధ్యమంటూ ఏదీ ఉండదు. అతడు తాను చేస్తున్న మంత్రజపంతో, భ్రమరకీట న్యాయంగా, సాక్షాత్తు దత్తాత్రేయుడుగా పరిణామం చెందుతాడు.

**1. ద్వాదశాక్షరమంత్రము :-**

ఆదౌ ప్రణవ ముచ్చార్య పాశబీజ మధోద్ధరేత్
హృల్లేఖా ముద్ధరే త్పశ్చా తత్పశ్చా దంకుశాక్షరం

ఏహీతి పదముచ్చార్య దత్తాత్రేయ స్తతః పరమ్
వహ్నిజాయాం తతః పచ్చా న్మంత్రోఽయం ద్వాదశాక్షరః॥

మొదట "ఓం", తర్వాత పాశబీజమైన "ఆం", ఆ తర్వాత "హ్రీం", ఆపైని అంకుశబీజమైన "క్రోం", అటుపిమ్మట "దత్తాత్రేయ" అనేపదం, ఆ తర్వాత దానికి "స్వాహా" అనేది చేర్చితే "ఓం, ఆం, హ్రీం, క్రోం, ఏహి, దత్తాత్రేయ స్వాహా" అనే ద్వాదశాక్షరీమంత్రం ఏర్పడుతుంది.

ఈమంత్రలో 12 అక్షరా లున్నవి. కనుక మంత్రజపం అక్షరలక్ష-అంటే 12 లక్షలు-చేయాలి. అప్పుడు మంత్రం సిద్ధిస్తుంది. గురూపదేశం పొందినవాళ్ళు మాత్రమే మంత్రాన్ని జపించాలి. "చాతుర్వర్ణ్యాధికారోఽయం" అని చెప్పటంవల్ల అన్ని వర్ణములవారు దత్తాత్రేయ మంత్రాలను జపించవచ్చు నని స్పష్టమౌతున్నది. 12లక్షలు మంత్రజపం చేసినతర్వాత తద్దశాంశము-అంటే 12 వేలు-తర్పణ చెయ్యాలి ఆతర్వాత తర్పణచేసిన దానిలో దశాంశము (12 వందలు) నెయ్యి, పాయసము (పాలు) లతో హోమం చెయ్యాలి. హోమం చేసినిదానిలో దశాంశము (120 మందికి) భోజనం పెట్టాలి. ప్రతిమంత్రానికి 1. జపం 2. తర్పణ 3. హోమం (కొంతమంది జపంతర్వాత హోమం, ఆ తర్వాత తర్పణ చేస్తారు) 4. అభిషేకం 5. బ్రాహ్మణభోజనం అనే పంచాంగాలు ఉంటాయి. ఈ ప్రకారంగా చూస్తే హోమ సంఖ్యలో దశాంశము (120) అభిషేకం, అందులో దశాంశము (12 మందికి) భోజనం పెట్టాలి. ఈఅభిషేకవిషయం దత్తాత్రేయ కల్పం ఎందువల్లనో చెప్పటం మరచిపోయింది.

**హోమవిధి :-**

దత్తగాయత్రితోగాని, మూలమంత్రంతోగాని హోమం చెయ్యవచ్చు. నిష్కామ్యంగా చేసిన జపహోమానికి నేయి, పాయసం సరిపోతుంది. కాని విశేషకామనలతో జపం చేసినప్పుడు హోమం విశేషద్రవ్యాలతో చేయవలసి ఉంటుంది. వశీకరణ కైనచో ఉప్పు, మధురద్రవ్యములతో హోమం చేయాలి. పసుపు, హరితాళములతో చేస్తే దుష్టస్తంభన, గోరోచనాది అష్టద్రవ్యాలతో చేస్తే దారిద్ర్యనాశనం, పుప్పొడితోకూడిన (కుసుమైర్మధుసంయుక్తైః అని మూలం) మందారపుష్పాలు, ఎఱ్ఱసిగరికతో చేసిన రాజవశ్యం గుగ్గిలం, ఇంగువ మొదలగువాటితో చేసిన భూతశాంతి, ఉమ్మెత్త, మఱ్ఱిపుల్లలను పంచగవ్యాలలో ముంచి చేసిన వ్యాదినివారణం, నాలుగంగుళాలు పొడపున్న దూర్వాంకురాలనూ, అమృతవల్లి (తిప్పతీగ) ఖండాలనూ గోఘృతంలో ముంచి చేసిన సర్వరోగ ప్రశమనం, మామిడిచిగుళ్ళతో చేస్తే స్త్రీవశ్యం, ఆముదంచెట్టు కాండాలు నేతిలో ముంచి చేస్తే గణవశ్యం అవుతుంది. జపాకుసుమాలు (దాసానిపూలు) రక్తవస్త్రంతో (ఎఱ్ఱని గుడ్డతో) కలిపి హోమం చేస్తే సమస్తకామనలు సిద్ధిస్తవి. సంపెంగపూలు, మొగలిపూలతో చేసినా ఇదేఫలితం చేకూరుతుంది. విష్ణుక్రాంత పుష్పాలతో, నీలివస్త్రాన్ని హోమం చేస్తే సమస్తకార్యసిద్ది కలుగుతుంది. ఈ విధంగా హోమప్రక్రియ పలువిధాలుగా ఉంటుంది. ఆ విశేషా లన్నింటిని గురువుద్వారా తెలుసుకోవటం మంచిది.

ఇక హోమగుండం నిర్మించేపద్ధతి చాలా రహస్యమైంది.

ఒక్కొక్క క్రియాసిద్ధికి ఒక్కొక్కరకంగా మనం అగుండాన్ని తయారుచేసుకోవలసి ఉంటుంది.

> శ్రుణు గుహ్యతరం లోకే షట్కర్మవిధిసాధనం
> వశ్యే తు చతురస్రం స్యా దాకర్షేతు త్రికోణకం
> స్తంభనే వర్తులం దేవీ! షట్కోణం నాశనం స్మృతం
> పంచకోణం చ విద్వేషే తథై వోచ్చాటనే స్మృతం॥

వశ్యంకోసం మంత్రజపం చేసినప్పుడు హోమగుండాన్ని చతుర స్రాకారంగా నిర్మించాలి. ఆకర్షణకోసమైతే త్రికోణాకారంగా, స్తంభనకొఱకైతే వృత్తాకారంగా, నాశనాన్ని సంకల్పించి చేస్తే షట్కోణాకారంగా, శత్రునాశనానికైతే పంచకోణాకారంగా, ఉచ్చాటనకైతే అట్లాగే పంచకోణంగా హోమగుండాన్ని తయారు చేసుకోవాలి. "జ్ఞాత్వా త్రివర్షపర్యంతం పాపకర్మణి నిష్ఠితమ్" ఎంతటి పాపమైనా సరే! ఈ హోమప్రక్రియద్వారా తొలిగి పోతుంది. పరదేశాలనుంచి మనదేశానికి ముప్పు వచ్చే పరిస్థితిలో, గో బ్రాహ్మణ పరిరక్షణకు ఉచ్చాటన, నాశనాలను సంకల్పించి హోమం చేయవచ్చు. అందులో దోషం లేదు. కాని వ్యక్తి గత విద్వేషంతో, స్వార్థంతో చేసిన హోమప్రక్రియ తిప్పికొడుతుంది. చివరకు తనకే వినాశనం కలుగుతుంది. ఇట్లా స్వార్థంతో హోమంచేసేవాణ్ణి పరమశాంతమూర్తియైన దత్తాత్రేయుడు సహించడు. ఈ విషయాన్ని గమనించి సాధకులు విశ్వకళ్యాణంకోసం శాంతస్వభావులై, సర్వహితైషులై మంత్ర జప హోమాదిక్రియలు నిర్వర్తించవలెను.

యంత్రోద్ధారము :-

ప్రతిమంత్రానికీ ఒకయంత్రం, ఒకతంత్రం ఉంటుంది. ద్వాదశాక్షరీమంత్రానికి సంబంధించిన యంత్రాన్ని ఎట్లా తయారు చేసుకోవాలో ఆకల్పంలో ఇటా చెప్పబడింది.

యంత్రోద్ధారం ప్రవక్ష్యామి సావధానతయా శృణు
ద్వాదశాతిమంత్రస్య రహస్యాతిరహస్యకం॥
ఆదౌ వృత్తం సమాలిఖ్య [1]చతుష్పత్రం తతఃపరమ్
తతః పశ్చా దష్టదళం విలిఖే ద్భూపురం తతః॥
వేదాదిం విలిఖేద్వృత్తే తద్బీజం ప్రణవాంతరే
చతుర్దశేషు చత్వారి వేదాదీని సమాలిఖేత్॥
ఏహ్యాదీ న్యష్టబీజాని దళేద్వష్టసు విన్యసేత్
[2]తత్సంధి ష్వంగమంత్రాశ్చ సమంతా త్పరిపూజయేత్॥
అకారాదిక్షకారాంతై [3]ర్బిందువన్మాతృకాక్షరైః
అనులోమవిలోమాభ్యాం వేష్టయేచ్చ దళాత్మకమ్॥
భూపురం వేష్టయే త్పశ్చాత్ భూబీజై ర్దశభిః పృథక్
వృత్తంతు ప్రణవేనైవ వేష్టయేచ్చ ప్రయత్నతః॥
చతుర్దళం వేష్టయేచ్చ బీజైః [4]పాశగజాంకుశైః
(ఉం ఊం ఓం గం జం డం దం సం లం శం చ దశ
భూపురే)॥

మొదట వృత్తాన్ని గీసి, ఆ తరువాత చతురస్రం దానిచుట్టూ

---

1 చతురస్రం 1 తత్సంధౌ సర్వమంత్రాణాం 3 బీజ
4 పాశాంగజై శ్శుభైః

గీయాలి. ఆ పిమ్మట అష్టదళపద్మం వ్రాసి, భూపురం లిఖించి, దానిమధ్య "ఓం", అటుపిమ్మట మంత్రబీజాలను ప్రణవసహితంగా వ్రాయాలి. 14 దళములలో ఇట్లు వ్రాసి, "ఏహి" మొదలైన ఏనిమిది బీజాక్షరాలనూ 8 దళాలలో వ్రాయాలి. దళం మధ్యనున్న ఖాళీలలో అకారమునుండి క్షకారమువరకూ ఉన్న అక్షరాలను వ్రాయాలి. భూపురం చుట్టూ మంత్రాన్ని అనులోమంగా, విలోమంగా వృత్తం చుట్టూ వచ్చేటట్లు వ్రాయాలి. ఈ యంత్రోద్ధారము గురుముఖముగా బాగుగా తెలుసుకొని చేయాలి. అంతేకాని పుస్తకము చూచి స్వయముగా వేయరాదు యంత్రమును పూజించుటవలన సాధకుడు శక్తివంతు డౌతాడు. ఆ శక్తిని స్వార్థమునకు ఉపయోగిస్తే దత్తుడు క్రుద్ధు డౌతాడు యంత్రాన్ని మంత్రస్వరూపంగా భావించి, పూజించి, సత్ఫలితం పొందవలసి ఉంటుంది.

దత్తమంత్రాన్ని పర్వదినాలలో-ముఖ్యంగా-గ్రహణసమయాలలో ఉపదేశిస్తే, ఉపదేశం పొందినవానికి మంత్రం శీఘ్రంగా సిద్ధిస్తుంది. గ్రహణవేళలో స్పర్శకాలం లగాయితు మోక్షకాలం దాకా మంత్రజపం చెయ్యాలి. ఆ తర్వాత దశాంశం తర్పణ, తద్దశాంశం హోమం చేసి, బ్రాహ్మణభోజనం పెట్టాలి. ఇట్లా చేస్తే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. తర్పణహోమాదులు లేకపోయిననూ, ఏకాగ్రతతో, తన్మయత్వంతో మంత్రాన్ని జపించిననూ అది సిద్ధిస్తుంది. అట్లని-తర్పణహోమాదులతో పని లేదనుకొనరాదు. చేతనైనంతవరకూ విధ్యుక్తముగా జరుపుట శ్రేష్ఠము.

షడంగన్యాసవిధి :-

ద్వాభ్యాం ద్వాభ్యాం పునర్ద్వాభ్యాం చతుర్థిశ్చ తతఃపరం
పునర్ద్వాభ్యాం ప్రకుర్వీత పంఛాంగన్యాస ఈరితం॥
ఉపయుక్తేన బీజేన షడంగా న్యథవాక్రియాః
ఏవం న్యాసవిధిం కృత్వా తతో ధ్యానం సమాచరేత్॥

ద్వాదశాక్షరమంత్రజపానికి ముందు కరహృదయాదిన్యాసములు మూలమంత్రముతో చేయవచ్చును. లేదా దత్తాత్రేయ షడ్బీజములతోనైనను చేయవచ్చును. మూలమంత్రముతో చేయునప్పుడు ఓం అం, హ్రీం క్రోం, ఏహి, దత్తాత్రేయ, స్వాహా-అని పంచాంగన్యాసములే ఉండును. దత్తాత్రేయ షడ్బీజములతో చేసిన ద్రాం, ద్రీం, ద్రూం, ద్రైం, ద్రౌం, ద్రః - అను షడంగ న్యాసము లుండును. ఆ పిదప "వాఖ్యాముద్రాం" అనే శ్లోకం చదివి పంచపూజలు చేయాలి, విశేషములు మంత్రకల్పములో వివరించబడినవి.

సప్తావరణలు :-

ఆ తర్వాత ఆవరణ దేవతలను ఆరాధించాలి. ప్రథమావరణంలో-షడంగాలనూ, వహ్నీశ రక్షో వాయువ్యాదులనూ, ద్వితీయావరణంలో-చతుర్వేద, ఇతిహాస, పురాణ, మీమాంస, న్యాయశాస్త్రిలనూ, తృతీయావరణంలో-సరస్వతీ, గణపతి, శుక, సుమంత, జైమిని, వైశంపాయన, పైల, గోభిలులనూ, చతుర్థావరణంలో-కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, వసిష్ఠ, వ్యాసాదులనూ, పంచమావరణంలో-అష్టసిద్ధులనూ,

షష్ఠావరణంలో – మత్స్యేంద్రాదినవనాథులనూ, భైరవుణ్ణి, సప్తావరణంలో-అష్టదిక్పాలకునూ పూజించి దత్తమంత్రజపం చేయాలి.

ఇక్కడ మనం గమనించవలసిన ముఖ్యవిషయ మొకటి ఉంది. ఏకామ్యాన్ని సఫలీకృతం చేసుకోవటంకోసం మనం దత్తాత్రేయుణ్ణి పూజిస్తున్నామో (జపిస్తున్నామో) దానికి అనుగుణమైన విధంగా దత్తాత్రేయు డున్నట్లు, మనం మనమనస్సులో ఆ ఆకారానికి రూపకల్పనం చేసుకొని-ఆమూర్తినే ధ్యానిస్తే ఇష్టకామ్యాలు సిద్ధిస్త వని దత్తాత్రేయకల్పం వక్కాణిస్తున్నది.

ఉదాహరణకు మనం జనవశీకరణకు జపం చెయ్యా లనుకొన్నప్పుడు —

జపాపుష్పారుణాకారో జటాపల్లవ శోభితః
తాంబూలాంచన్ముఖీ సాక్షా ద్బహ్వాస్త్రో వశ్యకృద్యువా॥

దాసాని పువ్వులవంటి ఎఱ్ఱనిరూపం కలిగినవాడూ, తాంబూలంతో కూడిన ఎఱ్ఱనినోరు గలవాడూ, ఎఱ్ఱనైన జడలు గలవాడూ, అందరినీ వశం చేసుకొనేవాడూ, యువకుడూ అయి దత్తాత్రేయు డున్నట్లు భావించాలి.

ద్వేషణానికి (ఎవరిమధ్యనైనా మైత్రి చెడగొట్టి విరోధం కలిగించడానికి) :-

శూలం దోర్భ్యాం సమాదాయ దిక్షు భిత్వా వినిక్షిపేత్
నానావర్ణశ్చ భ్రుకుటిః క్రూరాస్యో ద్వేషకారకః॥

రెండు చేతులతో శూలాన్ని ధరించి, దిక్కులను ఛిన్నా

భిన్నంచేసి పాతివేస్తున్నట్లూ, రంగులువారుతున్న బొమముడితో కూడిన, భయంకరమైనముఖం కలిగిఉన్నట్లూ, ద్వేషకారకుడైనట్లూ దత్తాత్రేయు డున్నట్లు ఆరూపాన్ని ధ్యానించాలి.

శత్రూచ్చాటనకు :-

వాయ్వస్థః కృష్ణరూపస్థః తమేవం చాలయ న్యజేత్
జ్యాఘాత్తైః పాదఘాతైశ్చ శత్రో రుచ్చాటకారకః॥

వాయువులో ఉన్నవాడు, నల్లనిరూపంతో ఉన్నవాడు, వింటి దెబ్బలతో, పాదఘాతాలతో శత్రువులను దూరంగా విసరిపారవేసే వాడుగా దత్తాత్రేయు డున్నట్లు ధ్యానించాలి.

శత్రుసంహారానికి :-

తిష్ఠన్ జానుయుగేనైవ నమ్రపాణియుగే సమే
కంఠే బధ్వా రిపూన్ హంతా ధ్యేయః కర్మణిమారణే॥

మోకాళ్ళమీద కూచోని, సమంగా వంచిన చేతులతో శత్రువుల గొంతు బిగించి చంపుతున్న విధంగా దత్తాత్రేయు డున్నట్లు భావించాలి.

ఆకర్షణకు :-

సపాశాంకుశమధ్యస్థం రక్తనానావిభూషణం
సాధ్యం నయంతం భిన్నాగ్రే ఛాయేవాకృష్టకర్మణి॥

సాధ్యుణ్ణి పాశంతో బంధించి, అంకుశంతో పట్టి లాగి, నీడలాగా ఆకర్షించి, తెచ్చేవాడుగా దత్తాత్రేయు డున్నట్లు స్మరించాలి.

శత్రుస్తంభనకు :-

పీతం పీతాంకుశం పీతపుష్పం పీతవిభూషణం
పీతాలేపం ద్విషత్ జిహ్వాధరం స్తంభకరం స్మరేత్॥

పసుపుపచ్చనివాడు, పీతాంకుశం ధరించినవాడు, పసుపు పచ్చనిపూలు, నగలు ధరించినవాడు, పసుపుపచ్చని మెయిపూతలు గలవాడు, శత్రువులను స్తంభింపజేసేవాడుగా దత్తాత్రేయు డున్నట్లు భావించాలి.

ఈ విధంగా ఆయా కోర్కెలతో జపం చేస్తున్నప్పుడు ఆయా విధాలుగా దత్తాత్రేయస్వామిరూపం ఉన్నట్లు సాధకుడు మనస్సులో భావించి జపం చేస్తే ఆకామ్యం శీఘ్రంగా ఫలిస్తుంది.

యంత్రమహిమ :-

దత్తాత్రేయయంత్రం భూర్జపత్రంమీదగాని, తాటియాకుమీద గాని, అశ్వత్థవటపత్రాలమీదగాని, వెండి, బంగారం, రాగిరేకులపై గాని, నేలమీదగాని, గోడమీదగాని లిఖించి, అష్టగంధాలతో అష్టపిష్టాలతో (తెల్లనివికాని ఎనిమిది రకాల ధాన్యాలపిండితో), ఎరుపు, తెలుపు మొదలైన ఆకులతో, గురువు చెప్పిన ప్రకారం శ్రద్ధగా పూజించాలి "గురుహీనం చ యత్కించి న్నకర్తవ్యం కథాచన" గురువుసలహా లేనిది ఏ కార్యము స్వతంత్రించి చేయరా దని కల్పము చెబుతున్నది. క్షీరపాత్రలోగాని, జలపాత్రలోగాని ఆయంత్రాన్ని నిక్షేపించి, జపపూజానంతరం ఆ పాలను (లేదా ఆ నీళ్ళను) తీర్థంగా పుచ్చుకోవాలి. ఆ తీర్థం పుచ్చుకోవటంవల్ల గుదరోగములు, నాభీరోగములు, నేత్రరోగములు, హృదయ

వ్యాధులు, కంఠవ్యాధులు మొదలైన దీర్ఘ వ్యాధు లన్నీ నశిస్తాయి. యంత్రధారణంవల్ల భూతపిశాచాది గ్రహబాధలు తొలిగి, శాంతి చేకూరి, ఆయారారోగ్య ఐశ్వర్యములు లభిస్తాయి.

**షోడశాక్షరమంత్రము :-**

తార [1]మాదిం సముచ్చార్య తతో వాగ్భవ ముద్ధరేత్
కామబీజం తధా కుర్యా జ్జాతిత్రితయ సంయుతం॥
భువనేశం తధా [2]కుర్యా దధజాతిత్రయాన్వితం
చంద్రబీజం విసర్గాంతం నవమం పరికీర్తితం॥
[3]దత్తాత్రేయ చతుర్థ్యంతం పల్లవం శిరసామతం
షోడశాక్షరమంత్రోఽయం దత్తాత్రేయస్యయోగినః॥
తారవాగ్భవబీజాభ్యాం [3]హృదయాయనమ శ్చరేత్
కామబీజై స్త్రిభిః శీర్షం హృల్లేఖాభి [4]స్తథా శిఖా॥
చంద్రబీజేన కవచ మస్త్రం దత్తాది సప్తభిః
ఏవం పంచాంగకన్యాసం [5]షడంగానా మథాచరేత్॥

"ఓం ఐం క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః దత్తాత్రేయాయ స్వాహా" అనునది షోడశాక్షర మహామంత్రము. దత్తాత్రేయమంత్రములలో ఈ మంత్రము విశేషమైనది."సిద్ధి సిద్ధిర్భవేత్తస్య నరసిద్ధిః ప్రజాయతే" అని ఈ మంత్రము సిద్ధిస్తే మానవ జన్మ చరితార్థ మౌతుంది. ఈ మంత్రానికి తర్పణాదులు ద్వాదశాక్షరివలె ఉంటవి. "మంత్రాక్షర సహస్రికం" అని చెప్పటంవల్ల ఈ మంత్రాన్ని 16 వేలు జపిస్తే మంత్రసిద్ధి అవుతుంది.

---

1 మాదౌ 2 కుర్యాత్తత్తుజ్జాతిత్రయాన్వితం 3 ద్వాభ్యాం హృదయమాచరేత్ 4 స్త్రిభిఃశిఖాం 5 కృత్వా ధ్యానం సమాచరేత్

యంత్రోద్ధారము :-

యంత్రోద్ధారం ప్రవక్ష్యామి [1]షోడశార్ణమనో శ్శృణు
త్రికోణం విలిఖేత్ పూర్వం షట్కోణం విలిఖేత్తతః॥
అష్టపత్రం లిఖేత్పద్మం తతః పార్ధివమండలం
తార వాగ్భవ తద్బీజాన్ త్రిషు కోణేషు విలిఖేత్॥
వేష్టయే తత్ప్రణవే నైవ త్రికోణం పూరితం యథా
షట్కోణేషు లిఖే ద్బీ ః షట్కం హృల్లేఖయావృతం॥
చంద్ర బీజా ద్యష్టవర్ణాన్ అష్టారాబ్జే సమాలిఖేత్
ధారణా దస్యయంత్రస్య నానావిషవినాశనం॥

మొదట త్రికోణము గీయవలెను. పిదప షట్కోణము వ్రాసి, చుట్టూ అష్టదళములు వేసి, ఆ తర్వాత భూపురము వేయవలెను ఓం, ఐం బీజాలను త్రికోణమందు నింపవలెను. త్రికోణమును ఓం కారముతో చుట్టవలెను. షట్కోణములందు క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం బీజములను నింపవలెను. హ్రీం కారముతో దానిని చుట్టవలెను. అష్టదళములలో సౌః దత్తాత్రేయాయ స్వాహా" అను ఎనిమిది అక్షరములను వరుసగా నింపవలెను. ఈ మహాయంత్రాన్ని ధరిస్తే ఎటువంటి మహావిషాలైనా హరించి పోవును.

షడక్షరి :-

ఆదౌ ప్రణవ ముచ్చార్య శ్రీబీజం తదనంతరం
మాయాబీజం తతః పశ్చా త్కామబీజం తతఃపరమ్॥

---

1 సర్వసిద్ధి ప్రదాయకం

భూబీజంతు తతః పశ్చా ద్దత్తబీజం తతః పరమ్
అయం షడక్షరోమంత్రో [1]రహస్యస్త్వ ఈరితమ్॥
లక్షసంఖ్యా పురశ్చర్యా తద్దశాంశేన తర్పణం
హవనం భోజనం కృత్వా తతః కార్యాని సాధయేత్॥

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం ద్రాం—అనునది షడక్షర మంత్రము. ఒక లక్షమంత్రజపము చేసిన సిద్ధించును. దశాంశ తర్పణహోమభోజనాదులు అన్ని మంత్రములమాదిరిగానే చేయవలెను. "ఉత్తానితే కరతలే" అను శ్లోకముతో ధ్యానము చేయవలెను.

ఈ మంత్రపూజాజపవిషయములో చిన్న ఆవరణ భేదమున్నది తూర్పున లక్ష్మీనారాయణులను, దక్షిణమున పార్వతీపరమేశ్వరులను, పడమర రతీమన్మథులను ఉత్తరమున భూవరాహములను ఆవరణలో నిలిపి ఉపాసించవలెను. ఇట్లు ఉపాసించినవానికి చక్రవర్తిపదవి లభించును. ఈ మంత్రము నుచ్చరించినంత మాత్రమున సర్వాభీష్టములు సిద్ధించును. ఈ మంత్రరహస్యము తెలిసినవాడు శ్రీమన్నారాయణు డొక్కడు మాత్రమే.

యంత్రోద్ధారము :-

యంత్ర మస్య ప్రవక్షామి త్రికోణం పూర్వమాలిఖేత్
షట్కోణం విలిఖే త్పశ్చా త్త్రికోణే ప్రణవం లిఖేత్॥
షట్కోణే మంత్ర మఖిలం తత్సంధి ష్వంగమంత్రకాన్
ఏత ద్యంత్రస్య మాహాత్మ్యం వేత్తి [2]హైహయనాయకః

1 రహస్యతే సమీరితం 2 హోహాయనాయకః

మొదట త్రికోణము గీసి, ఆ తర్వాత షట్కోణము లిఖించి, ఆ త్రికోణమున 'ఓం' వ్రాయవలెను. షట్కోణముల మంత్రబీజాక్షరము లన్నియు వ్రాసి, ఆ కోణమధ్యస్థానములలో అంగమంత్రాలు లిఖించాలి. ఈ యంత్రమహిమ తెలిసినందువల్లనే కార్తవీర్యార్జును డంతటివాడు సహస్రబాహువైనాడు ఈ మంత్రము సర్వార్థ సిద్ధిదమనుటలో సందేహము లేదు.

ఏకాక్షరి :-

దత్తాత్రేయ బీజమైన "ద్రాం" అనునది ఏకాక్షరి. సంసార దుఃఖాన్ని అది ద్రవింపజేస్తుంది దానిముందు ప్రణవమును (ఓం) చేర్చి జపించుట సంప్రదాయముగా వచ్చుచున్నది. వ్యాసప్రోక్తమైన "దాం" లేక "దం" అనుదానిని కొందరు ఉపాసించుట కలదు. ద్రాం బీజషట్కముతో న్యాసములు చేసి ఆ తర్వాత "యోగారూఢం...." అను శ్లోకముతో దత్తాత్రేయస్వామిని ధ్యానించవలెను. ఈ మంత్రమునకు సంబంధించిన యంత్రము అష్టదళ పద్మముతో కూడియుండి, దానిమధ్య దత్తబీజము "ద్రాం" యుండును. ఈ మంత్రాన్ని 8 వేలు జపించిన సిద్ధించును. తర్పణ హవనాదులు అన్ని మంత్రముల మాదిరిగానే ఉండును.

అష్టాక్షరి :-

అష్టాక్షరమనుం వక్ష్యే [1]తద్బీజం తస్యనామకం

---

1 తద్బీజం క్రోం తతఃపరమ్-అనుపాఠాంతరము పరిశీలింపవలసి ఉన్నది.

నమఃపదసమాయుక్తం విదు రష్టాక్షరం మనుః
న్యాస ధ్యానాదికం సర్వం ఏకాక్షరమనోరివ
ఏకాక్షర మనోరివ యంత్ర మష్టదళాధికం
జపే దష్టసహస్రాణి పురశ్చరణసిద్ధయే

"ద్రాం దత్తాత్రేయాయనమః" అన్నది అష్టాక్షరీ మంత్రము. ఈ మంత్రమునకుకూడా ఏకాక్షరివలెనే తొలుత ఓంకారము చేర్చి జపించుట సంప్రదాయముగా వచ్చుచున్నది న్యాసధ్యానాదికములు ఏకాక్షరీ మంత్రము మాదిరిగానే చేయవలెను. ఈ మంత్రమునకు సంబంధించిన యంత్రము ఏకాక్షరీ మంత్రమువలెనే అష్టదళాధికము. ఈ మంత్రమును ఎనిమిది వేలు జపించిన మంత్రసిద్ధియగును.

**వింశత్యక్షరి :-**

ఈ వింశత్యక్షరి మంత్రమునకే "విశ్వాదర్శమంత్ర" మని మరియొక పేరున్నది.

విశ్వాదర్శమనుం వక్ష్యే షోడశాక్షర మంత్రతః
నమః ప్రాక్ శ్రీవిష్ణవేతి వింశద్వర్ణాత్మకోమనుః

షోడశాక్షరీమంత్ర బీజముల తర్వాత "శ్రీ విష్ణవేనమః" చేర్చవలెనని కల్పము చెప్పుచున్నది. అప్పుడు మంత్రము "ఓం ఐం క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః దత్తాత్రేయాయ శ్రీవిష్ణవేనమః" అగును. కాని—

"వింశత్యర్ణమనుం వక్ష్యే షోడశాక్షరమంత్రతః
శ్రీవిష్ణవే సమాయుక్తో వింశత్యర్ణాత్మకోమనుః"

అను పాఠాంతరము కన్పించుచున్నది. వివరములు దత్తాత్రేయ మంత్రకల్పము:లో మనము చూడవచ్చును. ఈమంత్రమును 20 వేలు జపించిన మంత్రసిద్ధి యగును

యంత్రోద్ధారము :-

అధికం కించి దస్త్యత పశ్చా ద్ద్వాదశపత్రకం
అష్టార్ణపర్ణం నాస్త్యత్రకార్యం ద్వాదశపత్రకం

షోడశాక్షరీమరత్రమునకు సంబంధించిన యంత్రముకంటే ఈ మంత్రమునకు సంబంధించిన యంత్రానికి ఒక విశేషముంది ఆయంత్రానికంటే అధికంగా ఈ యంత్రంలో ద్వాదశదళపద్మం ఉంటుంది. ఎనిమిది బీజాలపద్మం ఉండదు.

అనుష్టుభమంత్రము :-

దత్తాత్రేయ హరేకృష్ణ ఉన్మత్తానందదాయక
దిగంబర మునే బాల పిశాచ జ్ఞానసాగర

అనునది అనుష్టుప్‌మంత్రము. ఇది అన్ని మంత్రములకంటె పురాతన మైనది. సర్వమంత్రములకు ప్రాణమువంటిది ఒక్క పర్యాయము మంత్రమును స్మరించినంత మాత్రమున సర్వకార్యములు ఫలించును. ఈ మంత్రము మిగుల రహస్యమైనది. యోగ్యులైన వారికే దీనిని ఉపదేశింపవలయును.

"ద్వాభ్యాం ద్వాభ్యాం చతుర్భిశ్చ ద్వాభ్యాం ద్వాభ్యాం క్షమాత్పదైః
సంబుద్ధ్యంతై ర్నామభిశ్చ పంచాంగన్యాస ఈరితః॥

అని చెప్పటంవల్ల – దత్తాత్రేయహరే–కృష్ణ ఉన్మత్త – ఆనంద

దాయక–దిగంబరమునే–బాలపిశాచ – జ్ఞానసాగర–ఈరీతిగా కర హృదయాది న్యాసములు చేయవలెను (ఈ విషయమున కొన్ని పాఠభేదములు కన్పించుచున్నవి. అవి మంత్రికల్పములో చెప్ప బడినవి). "మంత్రే ద్వాదశనామాని షడంగా న్యథ వాచరేత్" అని కల్పములో చెప్పబడినది. "జప్యం వర్ణసహస్రికం" అనటం వల్ల మంత్రములో ఎన్నిఅక్షరము లున్నవో అన్నివేలు (32వేలు) మంత్రిజపము చేసి తద్దశాంశము తర్పణాదులు చేయవలెను.

**యంత్రోద్ధారము :–**

త్రికోణ మధ్యకోణ షట్కోణ మష్టపత్రం తతఃపరం
ద్వాదశారం షోడశారం వింశత్యార మతఃపరః॥
ద్వాత్రింశద్దళపద్మం చ తతః త్రివలయం లిఖేత్
భూపురద్వితయం పశ్చా దష్టపత్రవిభూషితం॥
మహాయంత్ర మిదం ప్రోక్తం దత్తాత్రేయస్యయోగినః
త్రికోణే విలిఖేత్ బీజం ప్రణవేనైవ వేష్టయేత్॥
లిఖే దష్టదళేపద్మేఽప్యష్టాక్షర మనుక్రమాత్
వేష్టయేత్ కామబీజేన పద్మమష్టదళం సుధీః [1]
ద్వాదశారే ద్వాదశార్ణం రమాబీజేన వేష్టయేత్
షోడశారే తు విలిఖేత్ షోడశాక్షరకం మనుః॥
కళాభిర్వేష్టయే త్సమ్యక్ షోడశార సరోరుహమ్
వింశత్యరాజ్ఞే విలిఖే ద్వింశత్యక్షరమంత్రికం॥
వేష్టయే ద్భూమిబీజేన వింశత్యారసరోరుహం
ద్వాత్రింశద్దళపద్మే తు లిఖే దానుష్టుభంమనుం॥

హల్బిస్తు వేష్టయే త్సమ్యక్ ద్వాత్రింశద్దళపద్మకం
మాలామంత్రం త్రివలయే వక్ష్యమాణం సమాలిఖేత్॥
వేష్టయే త్తృతీ్రవలయం పాశాంకుశయుగేనవై
భూపుర త్రితయే పశ్చా ద్భూబీజాన్ విలిఖేద్దశ॥
ఏవం యంత్రం లిఖిత్వాఽథ ప్రాణస్థాపన మాచరేత్
వత్రాత్రియస్యయంత్రాణాం దశాంగాని న సంతి హి
ఏకాదశావతారోఽయం దశాంగా త్మాఽవతారకః॥

పాఠాంతరము :-

త్రికోణ మథ షట్కోణ మష్టపత్ర మతఃపరం
ద్వాదశారం షోడశారం వింశత్యార మతఃపరం॥
ద్వాత్రింశద్దళపత్రం చ తతస్త్రివలయం లిఖేత్
భూపురం ద్వితయం పశ్చా దష్టవజ్రవిభూషితం॥
త్రికోణే విలిఖేత్ బీజం ప్రణవేనైవ వేష్టయేత్
షడక్షరం తు షట్కోణే మాయాబీజేన వేష్టయేత్॥
లిఖే దష్టదళేపద్మే అష్టాక్షరమనుత్తమం
వేష్టయేత్ కామబీజేన పద్మ మష్టదళం సుధీః॥
ద్వాదశారే ద్వాదశార్ణం రమాబీజేన వేష్టయేత్
షోడశారే తు విలిఖేత్ షోడశాక్షరకం మనుం॥
కళాభిర్వేష్టయేత్ సమ్యక్ షోడశారం సరోరుహం
వింశత్యారే తు విలిఖేత్ వింశద్వర్ణాత్మకం మనుం॥
వేష్టయేత్ రసబీజేన వింశత్యారం సరోరుహం
ద్వాత్రింశద్దళపద్మే తు లిఖేత్ అనుష్టుభం మనుం॥

హలభిర్వేష్టయేత్ పద్మం త్రింశద్దళసమన్వితం
మాలామంత్రం తతోలిఖ్యాత్ అంతరే లేఖయోర్ద్వయో॥
తత్సర్వం వేష్టయేత్ పశ్చాత్ పాశాంకుశయుగేనవై
భూపురే విలిఖేత్ పశ్చాత్ చతుర్థాష్టాక్షరాన్ దశ॥
దిక్పాలబీజాన్ విలిఖేత్ ప్రాణస్థాపన మాచరేత్
జపం కుర్యాద్ద్వి హావనంకుర్యాత్ బ్రాహ్మణభోజనం॥
గంధానులేపన వసన భూష తాంబూల దక్షిణైః
ఏవం కృత్వాభ్యర్చ్యయంత్రం దత్తాత్రేయస యోగినః॥
వందారు జనమందారం వాంచితార్ధ ఫలార్ణవం
భవారణ్య సుహాదావ నిర్వాపణ బలాహకం
మహాఘ హరణం పుంసాం మహావ్యాధి నివారణం
మహాగ్రహొచ్చాటనం చ మహాశ్రేయస్కరం పరం

ఈ యంత్రపూజ, మంత్రజపంవల్ల మహాపాపములు నశిం చును. మహావ్యాధులు నివారణ మగును. గ్రహబాధలు తొలగును. వేయిమాట లెందుకు ? ఈ యంత్రమునకు సాటి మరొకటిలేదు.

**మాలామంత్రము :-**

ఈ మంత్రము రహస్యాతిరహస్యమైనది. దశాక్షరీసమ యుక్తమైనది (ఓం ఆం హ్రీం క్రోం ఐం క్లీం సౌః శ్రీం గ్లాం ద్రాం అనునవి దశబీజములు). సర్వపల్లవరూపకమైనది "ఏకవా రోచ్చా రణేనమాత్రేణాఖిలసిద్ధయః" అని పేర్కొనటంవలన ఒకవా మీ మంత్రమును జపించిన అఖిలసిద్ధులు లభించును. ప్రతిదినః కనీసము పదిసార్లు జపించినను దత్తాత్రేయ ప్రసాదము లభించును

ఇది మహాశక్తివంతమైన మంత్రము. "[1]జప్యం వర్ణశతం" అని ఈ మంత్రప్రమాణము. ఈ మంత్రములో ఎన్ని అక్షరము లున్నవో అన్ని వందలసార్లు మంత్రమును జపించిన అతడు దత్తాత్రేయునితో సమానుడగును. తర్పణాదులు అన్ని మంత్రముల మాదిరిగానే చేయవలెను. ఈ మంత్రము "మంత్రకల్పము" లో చెప్పబడినది. అక్కడ దీనిని చూడవచ్చును.

**యంత్రములకు సంబంధించిన విశేషములు :-**

ఏక ద్వి త్రి చతుష్పంచ షట్సప్తాభిరంగుళైః
ఏకాక్షరాత్ అష్టమంత్రయంత్రాణాం మాన మీరితం॥
పూజాయంత్రం మంత్రమయం పంచాగుళసమం మితం
సప్తావరణ దేవానాం తత్త్వ ద్భావనయా యజేత్॥

**యంత్రాంతరము :-**

వృత్త షట్కోణాష్టపత్రం త్రివృద్ధ్వచతురశ్రకైః
మండితం చ సమాలిఖ్య కుర్యాత్ ఆవరణార్చనం॥

సప్తావరణ సయుక్తం దత్తాత్రేయస్యయోగినః
పూజాయంత్ర మిదం ప్రోక్తం అపృష్టమపి తే మయా॥

ప్రసిద్ధమైన దత్తాత్రేయ మహామంత్రాలకు ఎనిమిదింటికి సంబంధించిన యంత్రాలు తయారుచేసుకోవా లనుకొన్నప్పుడు— వీటి రహస్యాలనూ, తయారుచేసేవిధానాన్ని గురుముఖతః తెలుసు కోవటం మంచిది. లేదా యంత్రనిర్మాణంలో సిద్ధహస్తులైనవారి ద్వారా వాటిని నిర్మించే విధానం గ్రహించటం ఉత్తమం.

అవదూతచింతన శ్రీగురుదేవదత్త.

---

1 సహస్రావృత్తి జపాత్ సిద్ధిర్భవతి — అని కూడా ప్రమాణం ఉన్నది.

# శ్రీ దత్తాత్రేయ మంత్రకల్పము

## ప్రాతః స్మరణము :-

సాధకుడు తెల్లవారుఝామున బ్రాహ్మీముహూర్తంలో (గం॥ 4½ కు) "ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త" అని స్మరిస్తూ నిద్ర లేచి, కాళ్ళు, చేతులు, ముఖము కడుగుకొని, ఆసనముపై కూర్చుండి పదకొండుసారులు (కనీసం మూడు పర్యాయములు) ఓంకారమును జపించవలెను. ఓమ్మ్మ్మ్........... అని ఏంతసేపు శ్వాసను బంధించగలమోఅంతసేపు ప్రణవమును ఉచ్చరించవలెను. ఎం ఉచ్ఛైస్స్వనముతో చేసిన అంతమంచిది. తనప్రక్కన ఎవరి ఉండి, ఆప్రణవ ముచ్చరించుచున్నట్లుగా తా నుచ్చరించు శబ్ద తనకే వినబడుస్థితికి వచ్చినప్పుడు ఆ ప్రణవోచ్చారము సక్రమము జరుగుతున్నట్లు గుర్తు. శబ్దము నాభీస్థానమునుండి బయలుదేరది వలెను ముందు 'ఓమ్' అని పెద్దగా ఉచ్చరించుచు, క్రమక్ర ముగా....సన్నముగా .. మ్మ్మ్....అని ఆపవలెను. ఇట్లు ఓంకార చేసినతర్వాత దత్తాత్రేయప్రాతఃస్మరణము చేయవలెను. స్తోత్ర చేయునప్పుడు తన శిరస్సు పైభాగమున(సహస్రారమున) తె అష్టదళపద్మ మున్నట్లు భావించి, దానిమధ్య నవరత్నఖచిత సింహాసనముపై చిరునవ్వుతో వరదాభయహస్తములతో, సర్వాభ భూషితుడై, ఏకముఖుడై దత్తాత్రేయుడు ఆసీనుడై యున్న భావించుచు, సద్గురుస్వరూపమే దత్తాత్రేయుని స్వరూపమని చుచు, (లేదా దత్తాత్రేయులవారి హృదయములో తన గురువు

ధ్యానము చేయవలెను. "సాధకః ప్రాతరుత్థాయ కృతశౌచక్రియ స్స్మరేత్, ఆ త్రేయం బ్రహ్మరంధ్రస్థం ద్విభుజం గురురూపిణం" అనునది ఇందుకు ప్రమాణము.

దత్తాత్రేయ స్మరణము :-

ఓంకారం ప్రత్యగాత్మానం పరబ్రహ్మస్వరూపిణం
పరమాత్మాన మవ్యక్తం దత్తాత్రేయం స్మరామ్యహం॥
అనసూయాత్మజం చంద్రానుజం దుర్వాససోఽగ్రజం
నారాయణం మహావిష్ణుం దత్తాత్రేయం నమామ్యహం॥
మహాదేవం త్రినయనం భస్మోద్ధూళితవిగ్రహం
చిన్ముద్రితకరాంభోజం దత్తాత్రేయం భజామ్యహం॥
త్రిమూర్తిం త్రిగుణం త్ర్యర్ణం త్రిశక్తిం త్రిస్వరం త్రికం
త్రికోణాంతర్బిందురూపం దత్తాత్రేయం భజామ్యహం॥
బిందుత్రికోణషట్కోణం దత్తాత్రేయస్వరూపకం
సహ్యశాయిన మాత్రేయ మవధూతం నమామ్యహం॥
విష్ణోరంశావతారం చ శ్రీదత్తం స్మర్తృగామినం
శ్రీదత్తం యోగినం వందే హ్యవ దూతస్వరూపిణం॥
నిత్యం గంగాంభసి స్నానం భిక్షా చ కమలాలయే
మాతులింగపురే నిద్రా స్మృత స్సన్నిధికృత్సదా॥

ఈ స్తోత్రము చదివి "అవధూత చింతన శ్రీగురుదేవదత్త" అని పెద్దగా ఉచ్చరింపవలెను. సహస్రారమున ఉన్న దత్తాత్రేయుని పాదపద్మములనుండి స్రవించు అమృతధారలు శరీరము

నంతటిని తడుపుచున్నట్లు భావించుచు, ఐదునిమిషము లా ధ్యాన మున, నిశ్చలముగా అట్లే యుండవలెను. ఆ తర్వాత ఈ క్రింది స్తోత్రములు పఠించవలెను.

**శ్రీపాదాష్టకము :-**

వేదాంతవేద్యో వరయోగిరూపం
జగత్ప్రకాశం సురలోకపూజ్యం
ఇష్టార్థసిద్ధిం కరుణాకరేశం
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే॥

యోగీశరూపం పరమాత్మవేషం
సదానురాగం సహకార్యరూపం
వరప్రసాదం విభుదైకసేవ్యం
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే॥

కాషాయవస్త్రం కరదండధారిణం
కమండలుం పద్మకరేణశంఖం
చక్రం గదా భూషిత భూషణాఢ్యం
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే॥

భూలోకసారం భువనైకనాథం
నాథాధినాథం నరలోకనాథం
కృష్ణావతారం కరుణాకటాక్షం
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే॥

లోకాభిరామం గుణభూషణాఢ్యం
తేజోమునిశ్రేష్ట మునిర్వరేణ్యం

సమస్తదుఃఖాని భయాని శాంతం
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే॥

కృష్ణాసుతీరే వసతి ప్రసిద్ధం
శ్రీపాదశ్రీవల్లభయోగమూర్తిం
సర్వైర్జనైశ్చింతిత కల్పవృక్షం
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే॥

మంత్రాబ్ధిరాజం యతిరాజపూజ్యం
త్రైలోక్యనాథం జనసేవ్యనాథం
ఆనందచిత్తం అఖిలాత్మతేజం
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే॥

మంత్రానుగమ్యం మహానిర్వితేజం
మహత్ప్రకాశం మహాశాంతమూర్తిం
త్రైలోక్యచిత్తం అఖిలాత్మ తేజసం
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే॥

శ్రీపాదాష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి॥

### శ్రీనరసింహసరస్వతీశ అష్టకం :-

ఇందుకోటి తేజకీర్ణ సింధు భక్తవత్సలం
నందనాత్రి సూను దత్త మిందిరాక్ష శ్రీగురుం
గంధమాల్య అక్షతాది బృంద దేవవందితం
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మాం॥

మోహపాశ అంధకార జాతదూర భాస్కరం
ఆయతాక్ష పాహి శ్రియ వల్లభేశనాయకం
సేవ్యభక్తబృంద వరద భూయో భూయో నమామ్యహం
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మాం॥

చిత్తజాత వర్గషట్క మత్తవారణాంకుశం
సత్య(త్త్వ)సార శోభితాత్మ దత్త శ్రియవల్లభం
ఉత్తమావతార భూతకర్తృభక్తవత్సలం
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మాం॥

వ్యోమ వాయు తేజ ఆప భూమి కర్తృ మీశ్వరం
కామక్రోధ మోహరహిత సోమసూర్యలోచనం
కామితార్థదాతృ భక్తకామధేను శ్రీగురుం
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మాం॥

పుండరీక ఆయతాక్ష కుండలేందుతేజసం
చండదురిత ఖండనార్థ దండధారి శ్రీగురుం
మండలీకమౌళి మార్తాండ భాసితాననం
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మాం॥

వేదశాస్త్రస్తుత్యపాద మాదిమూర్తి శ్రీగురుం
నాదబిందుకళాతీత కల్పపాద సేవ్యయం
సేవ్యభక్తబృంద వరద భూయో భూయో నమామ్యహ
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మాం॥

అష్టయోగ తత్త్వనిష్ఠ తుష్ట జ్ఞానవారిధిం
కృష్ణవేణీతీరవాస పంచనదీ సంగమం

కష్టదైన్యదూర భక్తతుష్ట కామ్యదాయకం
వందయామి నారసింహ సరస్వతీశ పాహి మాం॥

నారసింహ సరస్వతీశ నామమష్టమౌక్తికం
హర కృత్య శారదేన గంగాధరాఖ్యస్యాత్మజం
ధారుణీశ దేవదీక్ష గురుమూర్తి తోషితం
పరమాత్మానంద శ్రేయ పుత్రపౌత్రదాయకం॥

నారసింహసరస్వతీశ అష్టకం చయః పఠేత్
ఘోరసంసారసింధు తారణాఖ్యసాధనం
సారజ్ఞాస దీర్ఘ ఆయు రారోగ్యాదిసంపదాం
చారువర్గ కామ్యలాభ నిత్యమేవ యః పఠేత్॥

శ్రీదత్తాత్రేయ ప్రాతఃస్మరణ :-

ప్రాతః స్మరామి కరుణావరుణాలయం తం
శ్రీదత్త మార్త వరదం వరదండహస్తం
సంతం (సంతతం) నిజార్తి శమనం దమనం వినీత
స్వాంతర్గతాఖిలమలం విమలం ప్రశాంతం॥

ప్రాత ర్భజామి భజ దిష్టవరప్రదం తం
దత్తం ప్రసాదసదనం వరహీరదం తం
కాంతం ముదాత్రితనయం భవమోక్షహేతుం
సేతుం వృషస్య పరమం జగదాదిహేతుం॥

ప్రాత ర్నమామి ప్రథయతోऽనసూయా
పుత్రం స్వమిత్రిం యమితోऽనసూయాః

భూయాంస అపాస్త (అపాప్త) మిహార్త బంధుం
కారుణ్యసింధుం ప్రణమామి భక్త్యా॥
లోకత్రయగురో ర్యస్తు శ్లోకత్రయ మిదం పఠేత్
శ్రీదత్తాత్రేయదేవస్య తస్యసంసారభీః కుతః?
(ఇతిశ్రీ వాసుదేవానంద సరస్వతీస్వామి విరచితం శ్రీదత్తా త్రేయ
ప్రాతఃస్మరణస్తోత్రం సంపూర్ణం)

ప్రాణాయామము :-

పఠనానంతరము "శ్రీదత్త శ్శరణం మమ", "అవదూత చింతన శ్రీగురుదేః దత్త" అని ఉచ్చరించి, 10 పర్యాయములు ప్రాణాయామము చేయవలెను.

ప్రాణాయామంలో 1 పూరకం (ఓం ఓం....అని 8 సార్లు ఉచ్చరించటానికి పట్టినంతకాలం గాలిని మెల్లగా లోపలికి పీల్చటం) 2 కుంభకం (ఓం ఓం ఓం....అని 32 సార్లు ఉచ్చరించటానికి పట్టేకాలం గాలిని లోపల నిలపటం) 3 రేచకం (ఓం ఓం....అని 16 సార్లు ఉచ్చరించటానికి పట్టేకాలం గాలిని బైటికి వదలటం) అనేవి మూడు ఉంటాయి. ఈ సమయం మొదట ఎక్కు వనిపిస్తే సగానికి తగ్గించి-క్రమంగా ఎక్కువచేస్తూ పోవచ్చు. మనస్సును స్థిరపరచుకొనుటకు ప్రాణాయామము ముఖ్యము.

కన్ను మూసి తెరచిన కాలమును మాత్రాకాల మని అంటారు బ్రహ్మానందసరస్వతీస్వామివారి అభిప్రాయప్రకారము మాత్ర అంటే ఒకసెకండు. ప్రాణాయామము 12 మాత్రలకాలమైనచో లఘు

వనబడును. దీనివలన స్వేదదోషం నశిస్తుంది. 24 మాత్రల కాలమైన మధ్యమము–దీనివలన వేపథుదోషము (కంపమునకు సంబంధించిన దోషము) నశించును. 36 మాత్రల కాలమైన ఉత్తమము దీనివలన విషాదదోషము నశించును. ఈ ప్రాణాయామంచేసేవాడికి ధ్వస్తి, ప్రాప్తి, సంవిత్తు, ప్రసాదము లనే నాలుగుదశలు కలుగుతాయి. ధ్వస్తి అనే దశలో మనస్సు పరిపక్వమై ఇష్టానిష్టములైన పుణ్యపాపకర్మలను ఉన్మీలిస్తుంది. ప్రాప్తి అనే దశలో ఐహికాముష్మికకామము లన్నీ లభిస్తాయి. సంవిత్ అనే దశలో దూరమందున్నవాటినీ, కనిపించకుండా ఉండేవాటినీ, అతీతానాగతములనూ సర్వం తెలుసుకొనే స్థితి కలుగుతుంది. ప్రసాద మనే నాలుగవదశలో ఇంద్రియా లన్నీ స్వాధీనంకావటం వల్ల ఆత్మనిష్ఠ కలిగి బ్రహ్మానందం చేకూరుతుంది.

ఈ ప్రాణాయాయం లఘువు, మధ్యమం, ఉత్తమం అని మూడువిధాలు. 8 సెకండ్లపూరకం 32సెకండ్లుకుంభకం 16 సెకండ్లు రేచకమైతే అది లఘుప్రాణాయామం. పూరకం 12 కుంభకం 48 రేచకం 24 సెకండ్లు అయితే అది మధ్యమం. పూరకం 16 కుంభకం 64 రేచకం 32 సెకండ్లయితే అది ఉత్తమప్రాణాయామం. ఈ ఉత్తమ ప్రాణాయామస్థితిని చేరుకొంటే సాధకుడు పైనిచెప్పిన నాలుదశలను అందుకొంటాడు దత్తాత్రేయ సంప్రదాయములో ఈ ప్రాణాయాయమునకు ప్రముఖస్థానమున్నది. 12 ప్రాణాయాయములు చేసిన ఒకధారణ అవుతుంది. రెండుధారణలు యోగ మనబడుతుం దని యోగశాస్త్రం చెబుతున్నది. ఈ యోగంవల్ల పాపాలన్నీ నశించటమేకాక మనస్సు నిశ్చలమై

ఆత్మదర్శన మౌతుంది. ఈ యోగ ప్రక్రియకు సంబంధించిన రహస్యాలను సంప్రదాయవిజ్ఞులనుండి తెలుసుకొని యోగాభ్యాసము. చేయవలెను.

మూడుసార్లు (కనీసము) పైనిచెప్పిన విధంగా ప్రాణాయామం చేసిన తరువాత ఐదునిమిషములు ప్రశాంతంగా కళ్ళుమూసుకొని, నిశ్చలంగాఉండి, ఆతర్వాత గురుగాయత్రి లేదా దత్తగాయత్రిని 10 పర్యాయములు జపించాలి

గురుగాయత్రి :-

ఓం దత్తాత్రేయాయ విద్మహే గాయత్రీశాయ
ధీమహి తన్నో గురుః ప్రచోదయాత్॥

దత్తగాయత్రి :-

ఓం దిగంబరాయ విద్మహే అవధూతాయ
ధీమహి తన్నో దత్తః ప్రచోదయాత్॥

దత్తగాయత్రి పాఠాంతరములు:-

1) ఓం అవధూతాయ విద్మహే అత్రిపుత్రాయ
ధీమహి తన్నో దత్తః ప్రచోదయాత్॥

2) ఓం అనసూయాయ విద్మహే అత్రిపుత్రాయ
ధీమహి తన్నో దత్తః ప్రచోదయాత్॥

ప్రాతఃస్మరణానంతరం సాధకుడు వెంటనే ఆసనంమీ నుంచిలేవక, ఒక అయిదు నిమిషాలసేపు కళ్ళుమూసుకొ సహస్రారంలో నెలకొనియున్న దత్తాత్రేయుణ్ణి ధ్యానించి ఆ తర్వా లేవాలి.

# మంత్రకల్పము

**జపవిధానము :-**

మంత్ర మనగా- "మ" మననము చేయువారిని, 'త్రి'- (త్రాణము) కాపాడునది అని అర్థము. జప మనగా- 'జ'-జన్మ విచ్ఛేదము చేయునది, 'ప'-పాపములను నాశనము చేయునది అని అర్థము మంత్రజపమువలన మన శరీరములో నాడీస్పందనము కలిగి, మహాశక్తి ఉద్భవించును. శరీరమునకు ఉత్తేజము కలిగి, బుద్ధి వికసించును. మానసిక ప్రశాంతి లభించును. జన్మార్జిత పాపములన్నియు నశించును.

గురువునుండి మంత్రదీక్ష పొందినవాడు, శుచియై, ఒక ఏకాంత ప్రశాంత ప్రదేశములో కూర్చుండి, ఏకాగ్రనిష్ఠతో మంత్రమును జపించవలెను. కాష్ఠాసనమున కూర్చుండి జపము చేసినచో దుఃఖము, యశోహాని, ఋణబాధ కలుగును. రాతిపై కూర్చుండి చేసినచో వ్యాధి సంభవించును. దర్భాసనమున చేసినచో వశీకరణము, పాపనాశనము, రోగవిముక్తి- వస్త్రముపై చేసిన దారిద్ర్యము కలుగును. "కృష్ణాజినే జ్ఞానసిద్ధి ర్మోక్షశ్రీ వ్యాఘ్రచర్మణే, కుశాసనే యోగసిద్ధి స్సర్వసిద్ధిస్తు కంబళే" అని శాస్త్రము చెబుతున్నది. దర్భాసనము, చిత్రాసనము పీటపై వేసుకొని జపముచేయుట మంచిది. మృగాజినం లేదా వ్యాఘ్రాజినం ఉత్తమోత్తమములు.

"అంగుష్ఠేతు మోక్షార్థీ తర్జనీ ధనవర్ధనీ

మాధ్యమాంగుళ్యం విద్యాత్ప్రై మరణం అనామికం తథా
కనిష్ఠాZకర్షణం చైవ ఇత్యైతే జపలక్షణం”

అని జపముచేయు విధానము చెప్పబడినది. జపము చేయు నప్పుడు చేతికొనలతో లెక్కించిన ఏకగుణఫలితము, వ్రేళ్ళకణుపులతో లెక్కించిన దశగుణఫలితము లభించును. ఉంగరపువ్రేలు మధ్యకణుపుమొదలుకొని ప్రదక్షిణముగా అన్నివ్రేళ్ళ కొనలమీదుగా చూపుడువేలు మూలమువరకు లెక్కించిన పదియగును. ఇట్లు కణుపుల ద్వారా లెక్కించుట శ్రేష్ఠము. శంఖములు, మణులు గల మాలతో చేసినఫలము శతగుణము, పగడపుదండతో చేసిన సహస్రఫలము, ముత్యాలహారంతో చేసిన పదిలక్షలరెట్లు ఫలితము వచ్చును. స్ఫటికమాలతో చేసిన పదిలక్షలరెట్లు ఫలము, తులసిపూసలతో, రుద్రాక్షలతో, దర్భగ్రంథులతో చేసినమాలతో జపించిన బహు పుణ్యము లభించును.

సాధకుడు ఆసనమున–సుఖాసీనుడై నిశ్చలముగా, సితారుగా కూర్చుండి, మాటవలన ధ్వనిరాకుండా జపము చేయవలెను. జప మాలను వస్త్రముతో కప్పి జపము చేయవలెను. బొటనవ్రేలు, మధ్య వ్రేలుమధ్య, మేరుపూసను ప్రక్కకు తప్పించి మాల త్రిప్పవలెను. జపమాలకు, తర్జని తాకరాదు. మేరుపూస దాటునట్లు పూసలను త్రిప్పరాదు. మేరుపూసను ప్రక్కకు తప్పించవలెను. ప్రాణాయామము మూడుసార్లు చేయుటవలన మేరుపూస దాటుటవలన వచ్చు పాపము నశించును. ప్రాతఃకాలమున బొడ్డుదగ్గర, మధ్యాహ్న కాలమున హృదయసమీపమున, సాయంకాలమున ముఖసమీప మున మాలను ధరించి జపము చేయవలయు నని శాస్త్ర నియమము.

నిత్య విధిగా మంత్రోపాసన చేయు సాధకుడు నిత్య జప సాధనకై ఒక శాశ్వతమైన ప్రదేశము నెన్నుకొని, ప్రతిదినము అచ్చటే కూర్చుండి జపము చేయవలెను. తరచుగా జపముచేయు ప్రదేశములను మార్చరాదు. జపము చేయుటకుగాను నిర్ణీత ప్రదేశమునకు పోయి, చేతిలో నీళ్ళుపోసుకొని 12 సార్లు అభిమంత్రించి జపము చేయుచోట చల్లవలెను. తర్వాత "అస్త్రాయఫట్"అని మళ్ళీ నీళ్ళు చల్లి "ఫట్"అని అస్థలాన్ని దర్భలతో కొట్టి, "కవచాయహుం"అని తిరిగి నీళ్ళుచల్లి, కూర్మాకారంగా చేతివేలితో ఆ ప్రదేశంలో వ్రాయాలి ఆ తర్వాత 1 ఆధారశక్త్యైనమః 2 కూర్మాయనయః 3 అనంతాయనమః 4 వరాహాయనమః 5 పృథివ్యైనమః 6 సుధార్ణవాయనమః 7 నవరత్నద్వీపాయనమః 8 స్వర్ణశైలాయనమః 9 నందనవనాయనమః 10 కల్పవృక్షేభ్యోనమః 11 రత్నభూమికాయైనమః 12 స్వర్ణప్రాకారాయైనమః 13 రత్నమంటపాయైనమః 14 స్వర్ణవేదికాయైనమః – అని ఆసనదేవతను అక్షతలతో పూజింపవలెను.

ఆ తర్వాత దర్భాసనం గాని, చిత్రాసనం గాని, కంబళిగాని పీటపై పరవాలి ''ఫట్"అని మళ్ళీ జలం ఆ ఆసనంమీద చల్లాలి. "హ్రాః ఆధారశక్తి కమలాసనాయ నమః" అని నమస్కరించి, తూర్పుగాగాని, ఉత్తరంగాగాని ముఖంపెట్టి కూర్చోవాలి

> "పృథ్వీ త్వయా ధృతా లోకా దేవి త్వం విష్ణునాధృతా
> త్వం చ ధారయ మాం దేవి పవిత్రం కురు చాసనే॥

అని భూదేవిని ప్రార్థించి, ఆసనం నాలుగు దిశలనూ "ఓం గం

గణేశాయనమః, ఓంసం సరస్వత్యైనమః ఓందుం దుర్గాయై నమః, ఓంక్షం క్షేత్రపాలకాయనమః" అంటూ అక్షతలుచల్లి పూజించాలి.

"ఓం మణిధారిణి, వజ్రిణి, శిఖరిణి, సర్వలోకవశంకరి, హుం ఫట్ స్వాహా"అని జుట్టు ముడివేసుకోవాలి. ఆతర్వాత "త్రిఖండా ముద్ర" వేయాలి

"అఖండ మండలాకారం విశ్వం వ్యాప్య వ్యవస్థితం
త్రైలోక్యం మండితం యేన మండలం తత్ సదాశివం॥"

"ఐం వ్యాపకమండలాయైనమః" అని నమస్కరించి ఈక్రింది "కారికాష్టకం" చదవాలి.

ద్వారశ్రీ స్సర్వదా పాతు దేహళీ పాతు మాం సదా
శంఖపద్మనిధీ రక్షాం కురుతా మర్థసిద్ధయే॥

గణనాథ స్సదా పాతు దుర్గా మాం పరిరక్షతు
వటుకః క్షేత్రపాలశ్చ రాజరాజేశ్వరోఽవతు॥

పరాశంభు స్సదా పాతు లలితా జన్మహేతుకః
జాతా సంవిన్మయీ యస్మా జ్జాతవేదా స్స పాతు మాం॥

కాదివిద్యా యతో జాతా స చిక్లీత స్సదాఽవతు
వాణీలక్ష్మ్యౌ సదా రక్షాం కురుతా మర్థసిద్ధయే ॥

శృంగేరిభట్టభారత్యౌ రేణుకా చ సదాఽవతు
ఏతశ్చాత్ర స్థితా స్సర్వా రక్షాం కుర్వంతు సర్వదా॥

ఇంద్రో రక్షతు మాం పూర్వే అగ్నేయ్యా మగ్నిదేవతా
యామ్యే యమ స్సదా పాతు నైరృత్యాం నిరృతిశ్చ మాం॥

పశ్చిమే వరుణః పాతు వాయవ్యాం వాయుదేవతా
ధనద శ్చోత్తరే పాతు చైశాన్యా మీశ్వరో విభుః॥
ఊర్ధ్వం ప్రజాపతిః పాత్వధస్తా చ్చానంతదేవతా
వాస్తూనా మధిపో బ్రహ్మ స్రష్టా రక్షతు సర్వతః

ఆ తర్వాత పాపశమనార్ధం ఇట్లా చదవాలి –

దేవ త్వత్ప్రకృతం చిత్తం పాపాక్రాంత మభూ న్మమ
తన్నిస్సరతు చిత్తాన్మే పాపం హుం ఫట్చ తే నమః
సూర్య స్సోమో యమః కాలో మహాభూతాని పంచ చ
ఏతే శుభాశుభ స్యేహ కర్మణో నవసాక్షిణః॥

ఈ క్రింది శ్లోకాన్ని చదివి, నమస్కారం చేసి, "భైరవాజ్ఞ" తీసుకోవాలి.

అతితీక్ష్ణమహాకాయ కల్పాంతదహనోపమ
భైరవాయ నమస్తుభ్యం అనుజ్ఞాం దాతు మర్హసి॥

తదుపరి ఆచమానం, ప్రాణాయామము చేసి సంకల్పంచెప్పుకోవాలి-

"....మమకుటుంబస్య, క్షేమ స్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వరాభివృద్ధిద్వారా ధర్మార్ధ కామ మోక్ష చతుర్విధ పురుషార్ధ ఫలసిద్ధ్యర్ధం, శ్రీదత్తాత్రేయ పరదేవతా ముద్దిశ్య శ్రీదత్తాత్రేయ పరదేవతా ప్రీత్యర్ధం శ్రీదత్తాత్రేయహృదయ, పూర్వమాల, పూర్వకవచ, ఉత్తర హృదయ, ఉత్తరమాలా, ఉత్తరకవచ, పంజర, ఉపనిషద్ద్వయ, సహస్రనామస్తోత్ర, అష్టోత్తర శతనామ స్తోత్ర, స్తవరాజపారాయణసహిత శ్రీదత్తాత్రేయ మహామంత్రజపం కరిష్యే" అని నీళ్ళు తాకాలి –

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః

అని గురువును సంస్మరించుకొని నమస్కారం చేయాలి.

ఓం గణానాం త్వాగణపతిగ్‌ం హవామహే
కవిం కవీనా ముపమశ్రవస్తమం
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనశ్శృణ్వన్నూతిభి స్సీద సాధనమ్॥

అని గణపతిని ప్రార్థించాలి –

అపక్రామంతు భూతాని పిశాచా స్సర్వతో దిశం
యాశ్చాత్ర నివసంత్యన్యదేవతా భువి సంస్థితాః ॥
అపసర్పంతు తే భూతా యే భూతా భువి సంస్థితాః
యేభూతా విఘ్నకర్తారస్తే నశ్యంతు శివాజ్ఞయా॥

అని చెప్పి, ఎడమపాదముతో భూమిని మూడుసార్లు కొట్టవలెను. కోపదృక్కులతో నాలుగుదిశలూ పరికించవలెను.

సముద్రమేఖలే దేవి పర్వతస్తనమండలే
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వ మే॥

అని భూమిని క్షమాపణ వేడి, నమస్కరించవలెను.

ధూమధ్వజం మహాభుజం స్వాహానాథం సురేశ్వరం
ప్రాకారరూపతో వ్యాప్తం మహావహ్నిం విచింతయే ॥

ఓం నమో భగవతే మహాజ్వాలాయ, మేషవాహనారూఢాయ, ధూమధ్వజాయ, స్వాహాప్రియాయ, సర్వదేవతాZZరాధ్యాయ

నిరుపమ విభవాయ, దివ్యమంగళ విగ్రహాయ, సర్వదేవతా గ్రగణ్యాయ, వహ్నయే, ఓంహ్రీంశ్రీం ప్రాకారరూపేణ సర్వతోऽవ స్థాయ, మాం రక్ష రక్ష, మహోపద్రవం నాశయ, నాశయ, ఓం హ్రీం హుం ఫట్ స్వాహా॥

ఈ విధంగా ప్రాకారత్రయాన్ని తనచుట్టూ క్షణంలో నిర్మించుకొన్నట్లు భావించాలి–

ఓం సుదర్శన సర్వదిశో బంధ బంధః, సర్వతో మాం రక్ష రక్ష, మామకా నశేషాన్ రక్ష రక్ష॥

ఇట్లా సుదర్శనమంత్రంతో దిగ్బంధనం చేసి, ఆ తర్వాత "భద్రం కర్ణేభిః, "సహనావవతు "ఇత్యాది శాంతి మంత్రాలు చదివి "శ్రీ దత్తాత్రేయ పూర్వహృదయం" మొదలైన మంత్రాలను క్రమంగా పఠించి, శ్రీదత్తాత్రేయాపరాధ క్షమాపణస్తోత్రముతో మంత్రానుష్ఠానివిధిని పూర్తి చేయాలి.

అట్లాకాక, జపం, పూజ ఒకేసారి చెయ్యాలనుకునేవాళ్ళు సుదర్శనమంత్రంతో దిగ్బంధనం చేసినతరువాత "ఓం హ్రీం"అని దీపాన్ని వెలిగించి, గంధ పుష్పాక్షతలతోదాన్ని పూజించాలి. "రం" అని ఉచ్చరించి, దీపశిఖను రెండుచేతులతో అద్ది, "ఓం ఘోరాయ, ఘోరతమాయ, మహారౌద్రాయ, వీరభద్రాయ, జ్వాలామాలినే, సర్వ దుష్టోప సంహర్త్రే హుం ఫట్ స్వాహా"అని ఆ తేజస్సును ఆత్మకు అర్పించినట్లు భావించాలి, "ఓం హుం ఫట్ స్వాహా"అని పలుకుతూ రెండుచేతులతో దీపప్రకాశాన్ని అద్ది ముఖానికి తాకిం

చాలి. "ఓం రక్ష రక్ష స్వాహా" అని హృదయాన్ని స్పృశించాలి. తర్వాత కలశారాధనం, పీఠపూజ, ప్రాణప్రతిష్ఠాపనం మొదలయినవి యథాక్రమంగా చేయాలి దత్తాత్రేయపూజాకల్పంలో ఆ విధానమంతా వివరించబడింది. అక్కడ గమనించవచ్చు,

దత్తాత్రేయ మంత్రజపవిధిలో ఒకక్రమం ఉంది. ఆక్రమాన్ని సాధకులు తప్పనిసరిగా పాటించవలసిఉంటుంది.

హృదయం ప్రజపే దాదౌ పూర్వమాలాం పఠే త్తతః
పూర్వవర్మ చ సంజప్య దత్తాత్రేయస్య యోగినః॥
దత్తాత్రేయమనూన్ జప్త్వా హృదయం ఉత్తరం పఠేత్
పఠే దుత్తరమాలాం చ కవచం పంజరం తతః
ఉపనిషద్ద్వయం పశ్చాన్నామ్నాం సహస్రకం పఠేత్
నామ్నా మష్టోత్తరశతం పఠే ద్దత్తస్యయోగినః ॥
స్తవరాజం పఠే త్పశ్చా దపరాధస్తవం పఠేత్
షడంగం చ పునర్న్యస్య ధ్యాత్వా దేవం సుసాధకః

ముందుగా దత్తాత్రేయహృదయం, తర్వాత పూర్వమాల, పూర్వకవచం పఠించాలి. తర్వాత గురూపదిష్టమంత్రాన్ని—కనీసం నూట ఎనిమిది పర్యాయాలైనా జపించాలి మంత్రదేవతే మంత్రరూపం దాల్చిందనీ, మంత్రం మంత్రాధిదేవత, గురువు తాను ఒక్కటేనన్న మానసికస్థితి పొంది చేసేజపం ఉత్తమోత్తమమైంది జపానికి ఏకాగ్రత ప్రధానం.

మంత్రజపం 1 వాచికం (పైకి వినిపించేటట్లు చేయటం) 2 ఉపాంశువు (పెదిమలు కదుపుతూ పైకివినబడకుండా చేయటం)

3 మానసికం (పెదవులు కదపకుండా చేయటం) అని మూడు విధాలు. మానసికజపం శ్రేష్ఠమైంది. 



ప్రతి మంత్రానికి "అస్యశ్రీ....ఋషిః....ఛందః....దేవతా...." అని ఉంటుంది. "అవిదిత్వా ఋషిః ఛందందైవతం యోగమేవ చ" అని ఋషి, దేవతా, ఛందస్సు, వినియోగములను తెలియకుండా మంత్రం పఠిస్తే ప్రయోజనం లేకపోగా — పైగా మహాపాపం వస్తుంది. "ఫలానామంత్రాన్ని దర్శించి, ఈ లోకానికి ప్రసాదించిన ఫలానా ఋషి అని ఆ ఋషిని కృతజ్ఞతా పూర్వకముగా తలచుకొనేటప్పుడు ఆఋషిని గౌరవపూర్వకంగా శిరస్సున ధరిస్తున్నా"నని భావించిశిరస్సుమధ్య భాగాన్ని కుడిచేత్తోస్పృశించాలి, ఆ మంత్రము ఏ ఛంధస్సుకు సంబంధించిందో ఆ ఛందస్సు మనకు తెలుపుతుంది. బృహతీ, జగతీ, పంక్తి, అనుష్టుప్, గాయత్రి ఇత్యాదిగా ఎన్నో ఛందస్సు లున్నాయి. "ఛందః" అన్నప్పుడు మనం మనముఖాన్ని తాకాలి. మంత్రాధిష్ఠాన దేవతారూపాన్ని ధ్యానిస్తూ "ఆదేవతను హృదయస్థము చేయుచున్నా"నని భావించుచు, దేవతపేరు ఉచ్చరించేటప్పుడు మనహృదయాన్ని స్పృశించవలెను.



మంత్రానికి బీజము, శక్తి, కీలకము లనే మూడు, ప్రధానాంశములున్నవి. మఱ్ఱివిత్తనంలో కొమ్మలు, రెమ్మలతో కూడిన బ్రహ్మాండమైన మఱ్ఱిచెట్టు సూక్ష్మరూపంగా ఇమిడిఉన్నట్లు, ఆ మంత్రబీజంలో సమస్తమైన బ్రహ్మాండం సూక్ష్మంగా ఇమిడి ఉంటుంది, "బీజ" మన్నప్పుడు గుహ్యాంగాన్ని తాకాలి. "శక్తి" అన్నప్పుడు పాదాలు తాకాలి. "కీలక"మన్నప్పుడు నాభిస్థానాన్ని

తాకాలి. [ఇట్లు గాక బీజ మన్నప్పుడుముఖభాగం యావత్తూ అన్ని వ్రేళ్ళతో తెరిచి చూపించటం, శక్తి అన్నప్పుడు అన్నివేళ్ళను ముడిచి నాభిని స్పృశించటం, కీలక మన్నప్పుడు అన్నివేళ్ళను ముడిచి కంఠాన్ని స్పృశించటం మరొక సంప్రదాయం. ఎవరి గురుసంప్రదాయాన్ని అనుసరించి వాళ్ళు ఆవిధంగా ఆచరించాలి] "కీలక"మంటే తాళపుచెవి అని అర్థం. మంత్ర మనే పెట్టెను తెరవడానికి ఉపయోగించే తాళపుచెవి అన్నమాట –కీలక మంటే. ఇది మంత్రానికి ఆయువుపట్టు. ఇక "జపే వినియోగః" అన్నప్పుడు ఉద్ధరిణె నీళ్ళలో అనామికను ముంచాలి. ఇట్లా అనడానికి ముందు, ఏ కోర్కెతో మనం జపంచేస్తున్నామో దాన్ని సంకల్పించాలి. ఇష్ట కామ్యార్థ సిద్ధికోసమైతే "ఇష్ట కామ్యార్థ సిద్ధ్యర్థ"మనీ, వ్యాధి నివారణ కోసమైతే "వ్యాధి నివారణార్థ"మనీ ఇత్యాదిగా సంకల్పించిచెప్పాలి. సంకల్పవిహీనమైన జపం నిష్ఫలం. నిష్కామంగా జపంచేసేటప్పుడు కూడా "శ్రీ దత్తాత్రేయ ప్రీత్యర్థే (ప్రసాదసిద్ధ్యర్థే) అనియైనా చెప్పాలి.

తర్వాత నిర్దిష్టబీజాలతో కరహృదయాది న్యాసములు చే "భూర్భువస్సువరోమితి దిగ్బంధః"అని దిగ్బంధనం చేయా కరన్యాసములు ఆరు, హృదయాదిన్యాసములు ఆరు ఉన్నవి. కొ చోట్ల పంచన్యాసములే ఉంటవి. మంత్రన్యాస విధానాన్ని అను రించి సాధకుడు ఆయా బీజాలతో న్యాసం చేయాలి. "న్యా మంటే "ఉంచుట"అని అర్థం. ఒక్కొక్క బీజాక్షరం పలికి, శక్తిని మనదేహంలో, ఆయాచోట్ల నిక్షిప్తము చేయటమే న్యాస న్యాసం వల్ల మంత్రబీజాల శక్తి మనదేహాన్ని కవచంగా స

క్షిస్తూ, మనం చేసేజపానికి ఏట్టి అవరోధాలు రాకుండా, ప్రతికూల శక్తుల బెడదనుంచి కాపాడుతూ ఉంటుంది. ఒక రహస్యముంది. మనం అష్టోత్తర శతనామావళి చెబుతూ (పూజచేసేటప్పుడు కాదు) నామన్యాస విధిగా చెయ్యాలి. శ్రీ దత్తాత్రేయపూజావిధిలో ఈవిషయం చెప్పబడింది. ఒక్కొక్క బీజాన్ని లేదా నామాన్ని స్మరిస్తూ కుడిచేత్తో ఆయా శరీరభాగాలను తాకటం న్యాసం. ఈ న్యాసం మన శరీరంచుట్టూ ఒకదుర్భేద్యమైన కవచాన్ని నిర్మిస్తుంది. కవచం పఠించేటప్పుడు కూడా ఆయా భాగాలను మనం తాకాలి. ఈ న్యాసం శరీరానికి రక్షణ కల్పిస్తుంది. కొన్ని మంత్రాలలో దిగ్బంధనం "భూర్భువస్సువరోమితి" అని కాకుండా వేరుగా ఉండ వచ్చు. అప్పుడు అక్కడ చెప్పినట్లు మనం చేయాలి.

ఆచమన విధి :-

24 నామస్మరణములతో చేయబడు క్రియలకు ఆచమనం అని పేరు. ఇందులో 1, 2, 3 నామములు "స్వాహా"యుక్తములు. అవి ఆధ్యాత్మిక అధిదైవిక అధిభౌతిక తాపత్రయ నివారణ సూచక ములు. మిగతా 21లో కర్మేంద్రియములు5, జ్ఞానేంద్రియములు5, తన్మాత్రలు5, ప్రాణములు5, అంతఃకరణము4 (మనోబుద్ధిచిత్త అహంకారములు) మొత్తం ఈ 24 జీవునకు ప్రతిబంధకాలు. వాటి నివారణార్థం (శుద్ధిక్లేశం) ఈ24 నమస్కారక్రియలు ఏర్పడ్డవి. 1, 2, 3 నామాలు చెబుతూ గోకర్ణాకృతిహస్తంతో జలప్రాశనం చెయ్యాలి 4, 5 చెబుతూ అరచేతులతో ఒకదానితో ఒకటి తుడుచుకోవాలి. 6, 7 చెబుతూ క్రింది పెదవి పైపెదవి తుడుచు

కోవాలి. [క్రింది పెదవిని బొటనవ్రేలితో, పైపెదవిని మధ్య అనామికముతో] 7, 8, 9, చెబుతూ శిరస్సును కొనవ్రేళ్ళతో మార్జనం చేసుకోవాలి. 10 చెబుతూ ఎడమచేతిని ప్రక్షాళనం చెయ్యాలి 11 చెబుతూ పాదములను ప్రక్షాళనం చెయ్యాలి. 12 చెబుతూ శిరస్సును తాకాలి. 13 చెబుతూ అన్ని వ్రేళ్ళచివరలతో గడ్డాన్ని తాకాలి. 14, 15 చెబుతూ బొటనవ్రేలు చూపుడు వ్రేలు కలిపి రెండు ముక్కు రంధ్రములనూ స్పృశించాలి. 16, 17 చెబుతూ బొటనవ్రేలు ఉంగరపువ్రేలు కలిపి కుడి ఎడమ నేత్రాలను తాకాలి. 18, 19 చెబుతూ ఉంగముువ్రేలు కనిష్ఠములతో కుడి ఎడమ చెవులు తాకాలి. 20 చెబుతూ బొటనవ్రేలు చిటికెనవ్రేలు కలిపి నాభీప్రదేశంలో ఉంచాలి. 21 చెబుతూ అరచేతిని హృదయం పై ఆనించాలి. 22 కుడిచేతివ్రేళ్ళకొనలను శిరస్సు నందుంచాలి. 23, 24 చెబుతూ కుడి పిడికిలితో కుడి ఎడమ భుజాల మూలములను తాకాలి. ఇట్లా ఈక్రియ స్వయమాకర్షణ (Self mesmerism)గా, మనోనిర్మలీకరణం (Inner Purification)గాఋషులచేత రూపొందించబడింది. ఈ ఆచమానమునకు పూర్వం మనసస్నానవిధి ఆచరించటం మనం మరచిపోరాదు.

అపవిత్ర పవిత్రోవా సర్వావస్థాం గతోఽపివా
యస్మరే త్పుండరీకాక్షం, సబాహ్యాభ్యంతరశ్శుచిః
(పుండరీకాక్ష, పుండరీకాక్ష, పుండరీకాక్ష అని ముమ్మా అనవలెను.)

గోవిందేతి సదాస్నానం గోవిందేతి సదాజపః
గోవిందేతి సదాధ్యానం సదా గోవిందకీర్తనం

కరంగన్యాస విధి :-

ఆచమన, ప్రాణాయామ, సంకల్పము లైనపిదప మంత్ర జపానికి ముందు వెనుక కరాంగన్యాసములు చేయవలెను. జపానంతరము దిగ్విమోకము చేయవలెను. కరన్యాసములు 6. అంగన్యాసములు 6 మొత్తం 12 న్యాసము లుండును. ఈ న్యాసక్రియ శరీరమునకు మంత్రకవచముగా ఉపకరించును. దుష్టశక్తులనుండి విఘ్నాది ప్రతిబంధకములనుండి రక్షణ కల్పించును కరన్యాసములలో మొదటిదిచెప్పేటప్పుడు రెండుచూపుడువ్రేళ్ళతో రెండు బొటనవ్రేళ్ళను తుడవాలి. రెండోది చెప్పేటప్పుడు బొటనవ్రేళ్ళతో చూపుడువేళ్ళను తుడవాలి. మూడోది చెప్పేటప్పుడు బొటనవ్రేళ్ళతో మధ్యవ్రేళ్ళను తుడవాలి. నాలుగోసారి బొటనవ్రేళ్ళతో ఉంగరవ్రేళ్ళనూ; ఐదోసారి బొటనవ్రేళ్ళతో చిటికెనవ్రేళ్ళనూ తుడిచి, ఆరోది చెప్పేటప్పుడు కుడిచేతివ్రేళ్ళనుంచి ఎడమచేతి వ్రేళ్ళను తుడవాలి.

ఇక అంగన్యాసాలలో మొదటిది చెప్పేటప్పుడు కుడిచేత్తో ఎదురురొమ్మును తాకాలి "శిరసే" అన్నప్పుడు శిరస్సును ముట్టుకోవాలి. "శిఖాయై వషట్" అన్నప్పుడు వెంట్రుకలు ముట్టుకొని చప్పట్లు ఒకదానిని కొట్టాలి. నాలుగోది చెప్పేటప్పుడు కుడిభుజాన్ని ఎడమచేత్తో, ఎడమభుజాన్ని కుడిచేత్తో తాకాలి. ఐదోది చెప్పేటప్పుడు కుడిచేత్తో కళ్ళను తాకి రెండు చేతులతో చప్పట్లు ఒకదాన్ని కొట్టాలి. "అస్త్రాయఫట్" అన్నప్పుడు రెండుచేతుల వ్రేళ్ళను రెండు చేతులతో తుడుచుకొని చప్పట్లు ఒకదాన్నికొట్టాలి.

"దిగ్బంధ"మన్నప్పుడు కుడిచేతి చూపుడువేలుతో ఎడమచేతి చూపుడువేలు మెలియవెయ్యాలి. "దిగ్విమోక"మన్నప్పుడు ఎడమ చేతి చూపుడువేలుతో కుడిచేతి చూపుడువేలును మెలియవెయ్యాలి. కూర్చున్న ప్రదేశానికి దుష్టశక్తులు ప్రవేశించి జపానికి విఘ్నం కలిగించకుండా దిగ్బంధనం పనిచేస్తుంది.

దిగ్బంధనం చేసిన తరువాత మనస్సులో మంత్రదీక్ష ఇచ్చిన గురువును స్మరించి నమస్కరించి, దేవతాధ్యానం చెయ్యాలి ధ్యానానంతరం లమిత్యాదిపంచపూజలు చెయ్యాలి. 'లం పృథివీ తత్వాత్మనే గంధం పరికల్పయామి, హం ఆకాశతత్వాత్మనే పుష్పం సమర్పయామి, యం వాయుతత్వాత్మనే ధూపం పరికల్ప యామి, రం అగ్నితత్వాత్మనే దీపం పరికల్పయామి, వం అమృత తత్వాత్మనే అమృత నైవేద్యం పరికల్పయామి, సం సర్వతత్వా త్మనే సర్వోపచార రాజోపచార పూజాం పరికల్పయామి - అని చెబుతూ ఒక్కొక్క పర్యాయం ఉద్ధరిణెడు నీళ్ళ పళ్ళెంలో ఉంచు తుండాలి. మంత్రజపం తరువాత తిరిగి కరాంగన్యాసాలు చేసి దిగ్విమోకంతో దిగ్బంధనం విప్పాలి.

ఆ తర్వాత మంత్రజపం మొదలుపెట్టాలి. రోజుకు కనీసం 108 సార్లు మంత్రజపం చేయాలనేది ఒక నియమం. మంత్రదీక్ష పొందినవాడు ఏ అవాంతర పరిస్థితులలోనో (దీర్ఘ వ్యాధి, అశౌచము మొ॥ సంభవించినప్పుడు) తప్ప ఏ రోజూ జపము లేకుండా ఉండరాదు. కనీసము దశమంత్రజపము మానసికంగానైనా చెయ్యాలి. ఒక్కొక్కమంత్రానికి "దీన్ని ఇన్నిసార్లు జపిస్తే మంత్ర

సిద్ధి" అనే నియమం ఉంటుంది. ఆ చెప్పిన సంఖ్యాప్రకారం మంత్రాన్ని జపించి దశాంశం తర్పణాదులు చేయాలి.

ఒక ముఖ్య విషయం. గాయత్రీమంత్రం విన్నా ఏ మంత్రం సిద్ధించదు. కాబట్టి మన మంత్రజపానికి ముందు దశగాయత్రీజప మైనా చెయ్యాలి. కొంతమంది దత్త మంత్రజపానికి ముందుగాని వెనుకగాని "దత్తగాయత్రి" లేదా "గురుగాయత్రి" మంత్రజపం చేయటం ఉంది. మరికొంతమంది గాయత్రీ సంపుటీకరణంతో దత్త మంత్రాన్ని జపించే సంప్రదాయంకూడా ఒకటి ఉన్నది. ఇది విశేష పద్ధతి మామూలు మంత్రజపంలో ఇట్లా చెయ్యా లనే నియమ మేదీ లేదు, ఎవరికి వారు, వారివారి గురూపదిష్టమార్గంలో – గురువుపై అచంచల భక్తివిశ్వాసాలుంచి, గురువునే త్రిమూర్త్యాత్మకుడైన దత్తాత్రేయుడిగా భావించి, తనకూ గురువుకూ భేదంలేదని, "దత్తోఽహం" అనుకుంటూ మంత్రజపం చేయటం సాధకుడి ప్రధానకర్తవ్యం.

"మంత్రజపానంతరం మళ్ళీ న్యాసములు చేసి, "భూర్భువ స్సువరోమితి దిగ్విమోకః"అని జపము మొదట చేసిన దిగ్బంధనాన్ని సడలించాలి. తర్వాత ఉద్ధరిణెతో నీళ్ళుతీసుకొని "....సర్వం శ్రీ దత్తాత్రేయార్పణ మస్తు"అని ఆ నీళ్ళు అరివేణిలో వదలాలి. ఆ వదిలిననీళ్ళు ఎవరూ తొక్కనిచోట – ఏ తులసికోటలోనో– పోయాలి.

మంత్రజపానికి ముందు దత్తాత్రేయపూర్వహృదయం, పూర్వ మాల, పూర్వకవచం చేసినట్లుగానే, జపం తర్వాత దత్తాత్రేయ

హృదయరాజం, ఉత్తరమాల, వజ్రకవచం, పంజరం, ఉపనిషద్ద్వయం, సహస్రనామస్తోత్రం, అష్టోత్తర శతనామస్తోత్రం, స్తవరాజం, దత్తాపరాధస్తవం పారాయణ చెయ్యాలి.

ఇక్కడ సాధకులు ఒక ముఖ్యమైన విషయం గమనించవలసి ఉంది. దత్తాత్రేయ మంత్రపరసక్రమం చూచి, ఇన్ని మంత్రాలు పఠించడానికి సమయం చాలదే అని నిరుత్సాహపడనవసరములేదు. మంత్రాలను ఏక్రమంగా పఠించాలో, ఏ విధంగా విధివిధానంగా పూజచెయ్యాలో ఆక్రమం సూచించబడిందే కాని, అవన్నీ వరుస క్రమం తప్పకుండా చెయ్యా లనే నియమ మంటూ ఏదీలేదు. వీలున్నవాళ్ళు తమ మంత్రజపంతోపాటు, ముందో వెనుకో తన కిష్టం వచ్చిన కవచాన్నో, మాలామంత్రాన్నో జపించవచ్చు. పూజ లఘువుగా చెయ్యా లనుకొనేవాళ్ళు 'పూజావిధిలో' చూపించిన లఘుపూజావిధానాన్ని అనుసరించి, తక్కువ సమయంలోనే తమ పూజ, జపాలను ముగించుకోవచ్చు. దత్తమంత్రజప విధానం తెలియజేయటం కోసం ఆ మంత్రక్రమం చూపబడింది. ఆక్రమాన్ని అనుసరించి సాధకులు ఎవరికి వాళ్ళు వాళ్ళవాళ్ళ ఇష్టానుసారం, వీలునుబట్టి యథేచ్ఛగా వేటినైనా ఉపాసించవచ్చు. జపవిధానంలో ఎంతకాలం జపం చేశామనీ, ఎన్ని స్తోత్రాలు చదివామనీ కాక ఎంత నిష్ఠతో, ఎంత ఏకాగ్రతతో, చేసామన్నది ప్రధానంగా భావించాలి. అనన్యమైన భక్తి తన్మయత్వం, స్థిరమైనమనస్సు ఉపాసకునకు ప్రధానమైన అంగాగాలుగా ప్రతి సాధకుడు భావించి, దృఢదీక్షా బద్ధుడు కావాలి. అప్పుడే మంత్రం సిద్ధిస్తుంది. శక్తి దత్తమౌతుంది.

# శ్రీ దత్తాత్రేయ మంత్రపఠన క్రమము

## శ్రీ దత్తాత్రేయ పూర్వహృదయం

అస్య శ్రీదత్తాత్రేయ హృదయ మహామంత్రస్య । శ్రీభగవాన్ ఈశ్వరో ఋషిః । అనుష్టుప్ ఛందః । శ్రీచిత్స్వరూప దత్తాత్రేయో దేవతా।[1]ఆం బీజం । హ్రీం శక్తిః । క్రోం కీలకం। మమాభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః॥

(ద్రాం, ద్రీం ద్రూం, ద్రైం, ద్రౌం, ద్రః – అనువానితో కరహృదయాది న్యాసములు చేయవలెను)

ధ్యానము :– [2]బాలచంద్ర సుశోభే చ కిరీటీ
పుష్పహార మణియుక్త వక్షస(క)మ్
పీతవస్త్ర పరి (మణి)శోభిత మధ్యం
ప్రణమా మ్యనసూయోద్భవ దత్తం॥

దత్తం సనాతనం నిత్యం నిర్వికల్పం నిరామయం
హర(రి)ం శివం మహాదేవం సర్వభూతోపకారకం॥ 1

నారాయణం మహావిష్ణుం సర్గస్థిత్యంతకారిణం
నిరాకారం చ సర్వేశం కార్తవీర్య వరప్రదం॥ 2

అత్రిపుత్రం మహాతేజం మునివంద్యం జనార్దనం
[3]ద్రాం బీజవరదం శుద్ధం హ్రీం బీజేన సమన్వితం॥ 3

---

1 ఒకప్రతిలో ఓం బీజమని ఉన్నది

2 శ్రీబాలచంద్ర శోభిత కిరీటినం – అని పాఠాంతరము

3 మాయాబీజ సమాయుక్తం పాశబీజం వరప్రదం

శరణ్యం శాశ్వతం యుక్తం మాయయా చ గుణాన్వితం
త్రిగుణం త్రిగుణాతీతం త్రియామాపతిమౌళికం॥ 4
రామం రమాపతిం కృష్ణం గోవిందం పీతావాససం
దిగంబరం నాగహారం వ్యాఘ్రచర్మోత్తరీయకం॥ 5
భస్మగంధాధి లిప్తాంగం మాయాము(యు)క్తం జగత్పతిం
నిర్గుణం చ గుణోపేతం విశ్వవ్యాపిన మీశ్వరం॥ 6
ధ్యాత్వా దేవం మహాత్మానం విశ్వవంద్యం ప్రభుం గురుం
కిరీటకుండలాభ్యాం చ యుక్తం రాజీవలోచనం॥ 7
చంద్రానుజం చంద్రవక్త్రం రుద్ర మింద్రాదివందితం
అనసూయావక్త్రపద్మదినేశ మమరాధిపం॥ 8
దేవదేవేశ యోగీశ [1]అబ్జజన్మాదివందిత
నారాయణ విరూపాక్ష దత్తాత్రేయ నమోఽస్తుతే॥ 9
అనంత కమలాకాంత ఔదుంబరస్థిత ప్రభో
నిరంజన మహాయోగిన్ దత్తాత్రేయ నమోఽస్తుతే॥ 10
మహాబాహో మునిమణే సర్వవిద్యావిశారద
స్థావరం జంగమానాం చ దత్తాత్రేయ నమోఽస్తుతే॥ 11
ఐంద్ర్యాం త్రా(పా)తు మహావీర్యో(రో) వహ్న్యాం ప్రణవ పూర్వకం
యామ్యాం దత్తాత్రేయో రక్షేత్ నైరృత్యాం భక్తవత్సలః 1
ప్రతీచ్యాం పాతు యోగీశో యోగీనాం హృదయేస్థితః
అనిల్యాం వరద శ్శంభుః కౌబేర్యాం [2]జగతఃప్రభుః 13

---

1 అబ్జాసనాదివందిత 2 చ జగత్ప్రభుః

[1]ఏకాక్షరో మహామంత్రః సర్వమంత్రేషు విశ్రుతః
అష్టాక్షరో సర్వసిద్ధిః సర్వతంత్రేషు గోపితః॥ 14

ఈశాన్యాం పాతు మే రామో ఊర్ధ్వం పాతు మహామునిః
[2]షడక్షరో మహామంత్రః పాత్వ ధస్తా జగత్‌పితా(పతిః)॥ 15

ఏవం పంక్తిదిశో రక్షేత్ యదురాజవరప్రదః
[3]అకారాది క్షకారాంతం సదా రక్షేత్ విభు స్స్వయం॥ 16

దత్తం దత్తం పునర్దత్తం యో వదేత్ భక్తిసంయుతః
తస్య పాపాని సర్వాణి క్షయం యాంతి న సంశయః॥ 17

య ఇదం [4]పఠతే నిత్యం హృదయం సర్వకామదం
పిశాచ శాకినీ భూత డాకినీ కాకినీ తథా॥ 18

బ్రహ్మరాక్షస భేతాళ జోటిం(టుం)గా బాలభూతకాః
గచ్ఛంతి పఠనా దేవ నాత్ర కార్యా విచారణా॥ 19

అపవర్గప్రదం సాక్షాత్ మనోరథప్రపూరకం
ఏకవారం ద్వివారం చ త్రివారం చ పఠేన్నరః॥ 20

---

1 ఈ శ్లోకము కొన్ని గ్రంథములలో కన్పించుటలేదు
2 పాత్వధస్తాజగద్రక్షాకరో దత్తగురుః ప్రభుః 3 ఏకాక్షరో మహామంత్రః సర్వమంత్రేషు విశ్రుతః క్షరస్మృతః: 17వ శ్లోకానికి బదులుగా "షడక్షరో మహామంత్రః; పావనోzష్టాక్షరస్మృతః సదారక్షేత్‌విభుస్స్వయం" అనుశ్లోకము, ఆతర్వాత "ఆదినాథస్య దత్తస్య హృదయం సర్వకామదం, దత్తం దత్తం పునర్దత్తం యో వదేత్ భక్తిసంయుతః" అను శ్లోకము కొన్ని గ్రంథములలో కనిపించుచున్నది. 4 పఠేత్

జన్మ మృత్యుం చ దుఃఖం చ నైవ ప్రాప్నోతి భక్తిమాన్
గోపనీయం ప్రయత్నేన జననీ జారవత్ ప్రియే॥ 21
నదేయం దుర్హృదే స్తోత్రం హృదయాఖ్యం చ భామినీ
గురుభక్తాయ దాతవ్యం అన్యథా న ప్రకాశయేత్॥ 22
తవ స్నేహాచ్చ కథితం భక్తిం జ్ఞాత్వా మయా శుభే
దత్తాత్రేయస్య కృపయా సంభవే [1]ద్దీర్ఘమాయుకః

(ఇతి శ్రీరుద్రయామళే శివపార్వతీసంవాదే శ్రీదత్తాత్రేయ హృదయస్తోత్రం సంపూర్ణం)

## శ్రీదత్తాత్రేయ పూర్వమాల

అస్య శ్రీమధుమతీసమేత శ్రీ దత్తాత్రేయ మాలా మంత్రస్య శబరఋషిః। శ్రీ దత్తాత్రేయో దేవతా। ఓం బీజం। నమః శక్తిః॥ శ్రీదత్తాత్రేయేతి కీలకం । గాయత్రీచ్ఛందః। శ్రీ మధుమతీసమేత త్రయస్త్రింశత్కోటి దేవతాస్వరూప శ్రీగురుదత్తాత్రేయ ప్రసాద సిద్ధ్యర్థే జపేవినియోగః॥

**న్యాసములు :-**

ఓం ఐం-అంగుష్ఠాభ్యాం నమః, క్లాం క్లీం క్లూం - తర్జనీభ్యాం నమః. హ్రాం, హ్రీం, హ్రూం మధ్యమాభ్యాంనమః, సౌః-అనామికాభ్యాంనమః, దత్తాత్రేయాయ-కనిష్ఠకాభ్యాం నమః, నమః-కరతల కరపృష్ఠాభ్యాం నమః (ఇట్లే హృదయాదిన్యాసములు చేయవలెను)

---

5 దైర్ఘ్యమాయుషః

ధ్యానం :-

మాలా కమండలు రధః కరపద్మయుగ్మే
మధ్యస్థ పాణియుగళే డమరు త్రిశూలే
యస్యస్త ఊర్ధ్వకరయోః శుభశంఖచక్రే
వందే త మత్రివరదం భుజషట్కయుక్తం॥
(ల మిత్యాది పంచపూజలు చేయవలెను)

మూలమంత్రము :-

ఓం, ఐం, క్లాం, క్లీం, క్లూం, హ్రాం, హ్రీం, హ్రూం, సౌః ఓం నమో భగవతే దత్తాత్రేయాయ, విష్ణుతేజాంశ సంభూతాయ, లోకానుగ్రహ కారణాయ, అనసూయాత్రివరకుమారాయ, సహస్రార్జునగురవే, మాణిక్యఖచితసింహాసనస్థాయ, మధుమతీసమేతాయ, సకలసురాసురబృంద వందితాయ, కపిలాదిమునిసిద్ధగణ సేవితాయ. జ్వల జ్వల, ప్రజ్వల ప్రజ్వల ; సకల భూత ప్రేత పిశాచ బ్రహ్మరాక్షసాది దుష్టగ్రహా నుచ్చాటనాయ, ఆవేశయ ఆవేశయ, భాషయ భాషయ, బంధయ బంధయ, నివారయ నివారయ, తాడయ తాడయ, మమ సర్వసౌభాగ్యం దాపయ దాపయ, శ్రీగురు దత్తాత్రేయాయ స్వాహా॥

(పూర్వం మాదిరిగానే కరహృదయాదిన్యాసములు చేసి,
"భూర్భువస్సువరోమితి దిగ్విమోకః" అనవలెను)

## శ్రీ దత్తాత్రేయ పూర్వకవచం

అస్య శ్రీ దత్తాత్రేయకవచస్తోత్ర మహామంత్రస్య। నారాయణ

ఋషిః। అనుష్టుప్ ఛందః। శ్రీదత్తాత్రేయో దేవతా। ఐం బీజం। క్లీంశక్తిః। స్వాహా కీలకం। మమ సర్వాభీష్టసిద్ధ్యర్థే జపేవినియోగః॥

**న్యాసములు** :– ఓం ఆం, ఓం ఈం, ఓం, ఊం ఓం ఏం, ఓం ఐం, ఓంఔం-లతో కరహృదయాది న్యాసములు చేయవలెను..

**ధ్యానము** :–

దత్తాత్రేయ హరే కృష్ణ ఉన్మత్తానందదాయక
దిగంబర మునే బాల పిశాచ జ్ఞానసాగర
(లమిత్యాది పంచపూజలు చేయవలెను).

మంత్రస్తోత్రము :–

భక్తాశ్రయ శిరః పాతు లలాటం మునిశేఖరః
యోగీశ్వరో దృశౌ పాతు త్రైలోక్యస్య ప్రియః శృతిః 1
కపాలౌ మునిరాజేంద్ర ముఖం పాతు కుమారకః
జిహ్వాం మే పాతు మంత్రాత్మా కంఠం విష్ణుస్వరూపకః॥ 2
స్కంధౌ కపిలవర్ణశ్చ దత్తాత్రేయా భుజౌ తథా
కర్ణౌ తు తాపసో నిత్యం హృదయం రాజయోగవిత్॥ 3
వక్షో మే హఠయోగీ చ స్తనౌ మే నాదయోగవిత్
పార్శ్వౌ తు యోగిరాజేంద్రో కుక్షిం మే యోగవాన్ ప్రభుః॥ 4
మధ్యం పాతు చ తేజస్వీ నాభిం మే జృంభయోగిరాట్
కటిం పింగళియోగీ చ యోగీశో జఘనం మమ॥ 5

గుహ్యం మే కర్మయోగీ చ తన్మూలం తత్త్వయోగవిత్
ఊరూ పరమహంస శ్చ జానునీ బిందుయోగవిత్॥ 6

జంఘే జటాధరః పాతు గుల్ఫౌ మే శివయోగవాన్
పాదౌమే విష్ణుయోగీచ పూర్వాంగం బ్రహ్మయోగవిత్॥ 7
అపరాంగం సదా రక్షేత్ దత్తాత్రేయో ముని స్తథా
సర్వాంగాని సదా రక్షేత్ దత్తాత్రేయో ఋషీశ్వరః॥ 8

పూర్వస్యాం దిశి మే పాతు [1]అష్టాంగయోగాభ్యాసవిత్
ఆగ్నేయ్యాం పాతు యోగీశో యామ్యాం మే నిగమప్రియః॥ 9
నైరృత్యాం పాతు విశ్వేశో సదా షట్కర్మయోగవిత్
వారుణ్యాం దిశి పార్శ్వే తు పాతు మే మునిపుంగవః॥ 10
కౌబేర్యాం తథైశాన్యాం పాతు మే సర్వామరప్రియః
అనసూయాసుతో రక్షేత్ ఊర్ధ్వంతు అపరం తథా॥ 11
పఠనే శ్రవణే చైవ [2]గిరిణాంగహ్వారేషు చ
అశ్వారోహే గజారోహే శిబికాందోళికే తథా॥ 12

వృక్షారోహే, శిలారోహే యుద్ధే [3]భువి రసాతలే
ఉద్యానే వనవాసే చ ఆసనే చ జప్త స్తథా॥ 13
[4]బాహ్యాభ్యంతరకాలేషు(తు) సర్వం రక్షే చ్చ ఈశ్వరః
శంఖచక్రకుఠారాది ఆయుధేభ్య స్త్రిసంధ్యయా॥ 14
సర్వరక్షాకరో రక్షేత్ కార్తవీర్యప్రియంకరః
బ్రహ్మరాక్షస భేతాళ కూశ్మాండ రాక్షసాదయః 15

---

1 అష్టాంగాభ్యాసయోగవిత్ 2 గిరిగహ్వారేషుచ
3 వహ్నౌ 4 గతిభ్యాంతర

ద్రాం-మధ్యమాభ్యాం నమః, ద్రైం-అనామికాభ్యాం నమః, ద్రౌం-కనిష్టకాభ్యాం నమః, ద్రం-కరతలకరపృష్టాభ్యాం నమః

ద్రాం-హృదయాయ నమః, ద్రీం-శిరసే స్వాహా, ద్రూం-శిఖాయైవషట్, ద్రైం-కవచాయ హుం, ద్రౌం-నేత్రత్రయాయ వౌషట్ ద్రః-అస్త్రాయఫట్, భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానం :-**

రవి శశికోటి ప్రకటితభాసాం
సత్య జ్ఞానానంద విలాసాం
చింతిత మనసా రత్నం హ్యేదం
సరతి చ యోగీ దత్తాత్రేయం

**పంచపూజలు :-**

ఓం ద్రాం శ్రీదత్తాత్రేయాయ నమః 'లం' పృథ్వీతత్త్వాత్మకం గంధం పరికల్పయామి [ఉద్దరిణెతో నీళ్ళు పళ్ళెంలో పోయాలి. ఇట్లే ప్రతిసారి చేయాలి].

ఓం ద్రాం శ్రీదత్తాత్రేయాయ నమః "హం" ఆకాశతత్త్వాత్మకం పుష్పం సమర్పయామి.

" " "యం" వాయుతత్త్వాత్మకం ధూపం పరికల్పయామి

" " "రం" తేజస్తత్త్వాత్మకం దీపం పరికల్పయామి

" " "వం" అమృతతత్త్వాత్మకం నైవేద్యం పరికల్పయామి

ఓం ద్రాం శ్రీ దత్తాత్రేయాయనమః "సం" సర్వతత్త్వాత్మకం
తాంబూలాది సర్వోపచారాన్
పరికల్పయామి

**మూలమంత్రం :-**

ఓం ద్రాం

**పాఠాంతరము :-**

అస్య శ్రీ దత్తాత్రేయ ఏకాక్షర మహామంత్రస్య। శబరరూపీ మహారుద్ర ఋషిః। గాయత్రీ ఛందః। శ్రీదత్తాత్రేయో పరమాత్మా దేవతా। ద్రాం బీజం। అం శక్తిః। క్రోం కీలకం। శ్రీదత్తాత్రేయ ప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః॥

(న్యాసములు పైనచెప్పిన విధముగనే చేయవలెను),

**ధ్యానం :-**

యోగారూఢం యోగపట్టేన యుక్తం (వీతం)
హస్తద్వంద్వం జానుయుగ్మే ప్రసార్య
[1]అంసాగ్ర స్ఫురగ్రక్త చంచజ్జటాకం
దత్తాత్రేయం భావయే(త్) వీక్షమాణం
(మిగిలినదంతయు పైమంత్రముమాదిరే)

**2. షడక్షరి :-**

అస్య శ్రీదత్తాత్రేయ షడక్షరీ మహామంత్రస్య। అర్థనారీశ్వర

1. అంసాగ్రస్థం రక్తసంచజ్జటాకం; దివ్యభూషాజటాకం(లం)

సదాశివఋషిః। అనుష్టుప్ ఛందః। భగవాన్ దత్తాత్రేయో దేవతా [1]ఓం శ్రీం బీజం। హ్రీం క్లీం శక్తిః। గ్లౌం ద్రాం కీలకం। శ్రీదత్తాత్రేయ షడక్షరీమంత్ర ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః॥

ఓం, శ్రీం, హ్రీం, క్లీం, గ్లౌం, ద్రాం– అను బీజములతో కరహృదయాదిన్యాసములు చేయవలెను.

ధ్యానం :–

ఉత్తానితే కరతలే వ్యపసవ్యసవ్య
సోపాన పర్వసదృశే వ్యురిపస్వనాభేః
ప్రస్తార్య చర్మవసనం భసితాంగరాగం
[2]మంత్రేణ తం భజత రక్తజటాకలాపం
(లమిత్యాది పంచపూజలు)

**మూలమంత్రము :–**

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం ద్రాం॥

**పాఠాంతరము :–**

అస్య శ్రీదత్తాత్రేయ షడక్షర మహామంత్రస్య। శబరో మహారుద్రఋషిః। గాయత్రీ ఛందః। శ్రీదత్తాత్రేయో దేవతా। ద్రాం బీజం శ్రీం శక్తిః హ్రీం కీలకం। జపే వినియోగః॥

(న్యాసములు ద్రాం ద్రీం.... అను బీజములతో చేయాలి. తక్కినది సమానమే).

1 ద్రాం బీజం, శ్రీం శక్తిః, హ్రీం కీలకం– అని పాఠాంతరము.
2 మంత్రేస్థితం, మతిప్రసుతం

**3. అష్టాక్షరి :-**

అస్య శ్రీదత్తాత్రేయ అష్టాక్షరీ మహామంత్రస్య, సదాశివ ఋషిః। గాయత్రీ ఛందః। శ్రీదత్తాత్రేయో దేవతా, ద్రాం బీజం। నమః శక్తిః। దత్తాత్రియాయ కీలకం। మమ శ్రీదత్తాత్రేయాష్టాక్షర మహామంత్రప్రసాదసిద్ధ్యర్థే। జపే వినియోగః॥

(ద్రాం........షడంగన్యాసములు చేయాలి)

**ధ్యానం :-**

యోగారూఢం యోగపట్టేన యుక్తం(వీతం)
హస్తద్వంద్వం జానుయుగ్మే ప్రసార్య
అంసాగ్రస్థ రక్తచంచజ్జటాకం
దత్తాత్రేయం [1]భావయే ద్వీక్షమాణం

(ఈ శ్లోకమునకు బదులుగా "ఉత్తానిత్రే కరతలే...." అను శ్లోకమును ధ్యానించుటగూడ కలదు.).

**మూలమంత్రము :-**

ఓం, ద్రాం, దత్తాత్రేయాయ నమః

[ఈ మంత్రజపమున కొందరు ఒకపద్ధతి పాటించుచున్నారు.

ధ్యానమునకు :-

మందారమూలే మణిపీఠ సంస్థం
[2]సువర్ణదామైక నిబద్ధకక్షం

---

1 భావయే వీక్షమాణం

2 "సువర్ణదానైక నిబద్ధదీక్షం" అని పాఠాంతరము.

[1]ధ్యాయేత్ పరీతం నవనాథసిద్ధైః
దారిద్ర్య దావానల కాలమేఘం (ఘైః)॥

అను శ్లోకమును వారు చదువుదురు. పంచపూజలు చేసి, "హరిం దత్తం ఆత్రేయం సిద్ధం బ్రహ్మవిద్యాం" అనే ప్రాణ మంత్రాన్ని హృదయంపై చెయ్యివేసుకొని 10 సార్లు చదువుతారు. ఆ తర్వాత "దత్తాత్రేయాయ విద్మహే। గాయత్రీశాయ ధీమహి తన్నో గురుః ప్రచోదయాత్" అనే గురుగాయత్రిని 10సార్లు పఠించి, ఆ పిదప మూలమంత్రజపం చేస్తారు].

4. ద్వాదశాక్షరి :—

అస్య శ్రీదత్తాత్రేయ ద్వాదశాక్షరీ మహామంత్రస్య। సదాశివ ఋషిః। శ్రీదత్తాత్రేయో దేవతా। అనుష్టుప్ ఛందః। శ్రీదత్తాత్రేయ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః॥

ఓం-అంగుష్ఠాభ్యాం నమః, నమో-తర్జనీభ్యాం నమః, భగవతే -మధ్యమాభ్యాం నమః, దత్తాత్రేయాయ—అనామికాభ్యాం నమః, నమః – కనిష్ఠకాభ్యాం నమః, ఓం నమో భగవతే దత్తాత్రేయాయ— కరతలకరపృష్ఠాభ్యాం నమః, ఇట్లే హృదయాదిన్యాసములు కూడా చేయవలెను.

ధ్యానం ;— దిగంబరం భస్మ [2]సుగంధలేపనం
చక్రం త్రిశూలం డమరుం గదాంచ
పద్మాసనస్థం శశిసూర్యనేత్రం
[3]దత్త త్రయం దేహిమభీష్టసిద్ధిం(సిద్ధ్యై॥)

---

1 ధ్యాయేత్ పరం తం 2 విలేపితాంగం
3 ధ్యాయేత్ సదా దత్తమభీష్టసిద్ధిదం.

